# అభ్యుదయ

సెప్టెంబర్ 1978 ఒక రూపాయి

'పల్లె నుంచి మిల్లుకు' అంట్యాకుల పైడిరాజు



# విషయసూచిక

అభ్యుదయ

సంచిక 9, సంపుటి 2 సెప్టెంబరు 1978 సాలు చందా రూ. 10

# ముఖచిత్ర గీతం

## స్రవంతి

కూలి వాళ్లు
బ్రతుకు పునాదులలో
మౌనంగా కూరుకుపోయిన రాళ్లు ;

రంగులూ, హంగులూ అన్నీ
పై గోడలకే వదలి,
మన్నునే నమ్ముకుని బ్రతుకుతున్న
అథోజగత్సోదరులు ;

సంఘాన్ని
సీతాకోకచిలుకలా సింగారించి
తాము మాత్రం
గొంగళి పురుగులుగానే
మిగిలిపోయిన మూగ జీవులు;

గుర్తింపు లేని త్యాగానికి
అర్థాకలి బ్రతుకులకు
అనాదిగా వారసులు.

ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం మద్రాసు శాఖ మాస పత్రిక

# జీవితాన్ని చీల్చుకు వచ్చే పద్యాలు వ్రాసిన నాయని సుబ్బారావు

ఏటుకూరి ప్రసాద్

భావకవితా యుగంలో, యిటీవల కీర్తిశేషులైన శ్రీ నాయని సుబ్బారావుగారొక మహోజ్జ్వల తార, ప్రణయ కవితా వనంలో మాయని వారు నాయని వారు.

కవిత దివినుండి భువికి దిగింది. కాల్పనికతను వదిలి, వాస్తవికతను చేపట్టింది. జీవిత సమస్యలు కవితకు యీనాడు కేంద్ర బిందువయ్యాయి. అయినా నాయని వారి వంటి పూర్వ తరాల ఉత్తమ కవులనుండి మనకు సంక్రమించిన సంపదలు భద్రపర్చుకో వలసినవి. 'మంచి గతమున కొంచెమే' కావచ్చు; కాని ఆ కొంచమూ యీనాటి మనకు నిరుపయోగమైనదేమీ కాదు. మన పరిణతికి విలువైనది కూడా.

"వేదుల నాయని వింజామరల వీవ
బసవరాజు కొడాలి పదములొత్త"

అని ఏనాడో కరుణశ్రీ నవ కవిత్వాన్ని స్త్రీగా భావించి ఎవరెవరు ఎలా ఆమెను సేవిస్తున్నారో చెప్పారు. అందులో నాయని సుబ్బారావుగారి పాత్ర ఏమిటో చిత్రించారు, భావ కవిత్వపు గుబాళింపులను తన కవితా వీవనలతో ఆయన విసురుతున్నారని.

20వ శతాబ్దం తొలి దశాబ్దాలలో సాంప్రదాయ వాదులను ధిక్కరించి, భావకవిత్వంగా ప్రసిద్ధమైన నవ్య కవితను ప్రతిష్ఠాపించిన రాయప్రోలు, కృష్ణశాస్త్రి వంటి ప్రముఖులలో నాయని ఒకరు.

భావకవిత్వం ప్రధానంగా పశ్చిమ దేశాల, వంగరాష్ట్ర సాహిత్య ప్రభావం వల్ల వచ్చిందన్న విషయం అందరికీ తెలిసిందే. వాటి లక్షణాల్లో ప్రధానమైన ప్రణయం, వలపూ దీనికి ఉపస్కారక మయ్యాయి. అమలిన శృంగారం, ఆత్మాశ్రయత్వం భావ కవిత్వంలో మనకు ప్రధానంగా కనిపిస్తాయి.

కృష్ణశాస్త్రి లాంటి వాళ్ళు ప్రణయంలో బాధను చూస్తే, నాయని వలపులో ఆనందాన్ని చూశారు. ప్రణయ యాత్ర సఫలం కావటం చూశారు. తాత్కాలికంగా వత్సలతో ఏర్పడ్డ ఎడబాటు బాధను భరించి, భవిష్యత్తుకు ఎదురు చూసిన సౌభద్రుడు, నాయని. కృష్ణశాస్త్రికి సతీవియోగం వల్ల తొలి ఖండ కావ్యం 'కన్నీరు'గా (1923)లో వెలువడితే, నాయని ప్రేమ 'వత్సల వలపు' తొలి ఖండ కావ్యంగా (1922) వెలువడింది.

నాయనికి పేరు తెచ్చింది 'సౌభద్రుని ప్రణయయాత్ర', 'ఫలశ్రుతి', 'మాత గీతాలు', 'సౌందర్య లహరి', 'వేదనా వాసుదేవం', 'వేదనా మోహనం', 'భాగ్య నగర కోకిల', 'జన్మ భూమి' తదితర రచనలు.

తిరుమల రామచంద్ర గారన్నట్టు మందను వెంటేసు

కొని ముందుకుపోయే గుణం కాదు వీరిది. ఆయా సంఘటనలూ, దృశ్యాలూ కదిలిస్తే కవితగా మార్చే స్వభావం. 1899 లో పొదిలిలో పుట్టిన వీరు, ప్రధానంగా ఉపాధ్యాయ వృత్తిలోనే ఎక్కువ కాలం ఉన్నారు. ఆకాశవాణికి హైద్రాబాద్‌లో కొంతకాలం పనిచేశారు.

చదువుకునే రోజుల్లో స్వాతంత్ర్య పోరాటం బాగా కదిలించింది. నాటి కవులలాగానే రాజకీయ ప్రభావానికి లోనైన జాతీయవాది. వీరు ఒకరకంగా నాటి మన జాతి దాస్యానికి కారణం చెప్తూ "ఇవి యొకరుండు తెచ్చితగిలించి బిగించిన త్రాళ్ళుగావు మానవు నవివేక మిట్లు పరిణామము చెందెను గాక" అని అంటారు. దీనికి కారణం వెతకలేక పోవటం మన అవివేకమనీ, అది తెలిసిననాడు "బంధన భంజకమై భావి ప్రపంచ సౌఖ్య ప్రతి పాదకమై స్వేచ్ఛాత్మకమై" జగం తేలియాడుతుందన్న ఆశను ప్రకటిస్తారు. అయితే మన తిరుగుబాటు జండా ఎత్తాల్సింది ఎవరి మీదంటే –

"మత విధాయకుల లిరమ్మద మూర్తులీర్ష్యా ప్రధాన సూత్రులు వృకోదరులు బలసి రణ లగ్నగతులు మారణ మగ్న మతులు గర్వ కళంకితులు నృపాలకులు మలసి ధనిక దానవులు లుబ్ధస్వాములు పరార్థసంగ్రహాగ్రణులు వంచకులు పొలసి" మన స్వాతంత్ర్యం మంట గల్పినవారి గురించి స్పష్టంగా చెప్తారు. మనలో గల హెచ్చుతగ్గులకు నాటి పాలకులే కారణమంటూ

ఒకని కొకండు హెచ్చని మ
రొక్కడు లొచ్చని యేమి భ్రాంతి సాం
ఘికముగ నడ్డకమ్ములు బి
గించి స్వకీయుల మధ్య జాతి జా
తికి గిరిగీసి ఐక్యము"– ను

నాశనం చేసినందుకు బాధ పడ్డారు. ఇదే భావం వీరి జీవితం పై ముద్ర వేసింది. కుల మతాల కతీతంగా ఉండే స్వభావాన్ని నాయని వారికి అందించింది, సంఘంలోని మంచి చెడ్డలను పసిగట్టగల్గే సవిమర్శక వాస్తవికతావాదిగా రూపొందించింది.

నాయని వారి భావ చిత్రణలు చాలా అందంగా, వాస్తవంగా, వినూత్నంగా ఉంటుంటాయి. ఆదినుండీ తన కవిత ద్వారా 'విరహ వార్ధికి వంతెన వేయునాసతో' వలపును పండిస్తానని శపథం చేస్తారు. మానవుడు ప్రేమద్వారానే ఉన్నతుడు కాగలడనీ, దాన్ని తన జీవితం నుండి వేరుచేసు కోటం అసాధ్యమనీ – అది వాత్సల్యంగా మారినా మారకున్నా తథ్యమనీ అంటారు.

'హృదయ పుస్తక మందదికింప బడిన
ప్రేమగీతాల పుట బింపి వేయుటెట్లు?"

అని ప్రశ్న వేయిస్తారు వత్సల చేత. వత్సల రాకకు –

'స్వాంతమను పళ్ళెరమ్మున వలపు
గప్పురమ్ము వెలిగించి' –

ఎదురు చూస్తున్న నాయకునకు వత్సల నిద్రపోవటం తెలిసింది, సమీపించాడు. నిద్రపోతోంది. 'టెక్క తలుపు లుంచిన ప్రేమామృతంపు జెలమలనగ' ఆమె కళ్ళు కనిపించాయట. కన్నురెప్పల, రెక్కల తల్పు తెరవంగానే చెలమల నుండి అమృతస్వాదనం చేద్దామని ఎదురు చూస్తూ కళ్ళుమూసుకున్నాడు. నిద్ర. కల. వత్సలా దర్శనం. ఆమె చేయి పట్టుకొని

"వలపు'కీ' పూర్తిగా నీయబడిన కతన
గుండె గడియార మెటు కొట్టుకొనునొ

చూడు''
మని గుండె కానించుకొన్నాడు. కల చెదిరింది. వత్సల చూపుమేర దాటింది. అప్పుడు తనకూ వత్సలకూ మధ్యగల బంధాన్ని –

''కండె జుట్టుచు దారమ్ము క్రమముగా
త్వదీయ సామీప్యమునకు రావించి
నన్ను నీదు హృదయాంతరమున
బంధింపు మంచు వేడుకొనుచుంటలేదు
నీ వ్రేళ్ళ మధ్య నలరు దారమ్ము
ద్రెంపకు మంతె చాలు''

అని అంటారు నాయని. ఇలా సాగిన ప్రణయ యాత్ర –

'అంతులేని యీ యాత్ర నిరంతరాయ
సాంతమయ్యె నాజన్మ సఫలమయ్యె''

అని భావించాడు. తృప్తి చెందాడు.

'''భావ'యనుమాట ప్రేమ ప్రపంచము
నకు నీవు పెట్టిన పేరు, నా భావమందు
పద్యములు తోచి అక్షర ప్రాభవమున
బయలు వెడలె'' -

అని భావకవిత్వంలోని ప్రణయ మూల రహస్యాన్ని విప్పిచెప్పారు నాయని.

మొదటి నుండీ వీరు ఏ ఉద్యమం లోనూ పూర్తిగా మమేకమైనవారు కాదు. కనుకనే కీర్తిప్రతిష్ఠల జోలికి పోకుండా తన కవితా వ్యవసాయంలో మునిగి పోయారు. అయితే దేశాన్ని గూర్చి ఆనాడు ప్రబలంగా ఉన్న రాయప్రోలు వారి భావనలే వీరికీ ఉండేవి. సమాజానికి పూర్తిగా అన్వయింపగల ధైర్యమున్న గురజాడ భావన ఆ నాడు వీరికి రుచించనట్టుంది. కనుకనే

''దేశము మట్టి యల్పమని
తీర్పు మహాకవి తీర్చెగాక'' –

కాని నాకు అంతగా నచ్చలేదన్నారు. గురజాడ ఉద్యమ స్వభావం, విప్లవ భావన తెలుగునేల నాలుగు చెరగులా నేటిలా వ్యాప్తి చెందని రోజులవి. భావ కవిత్వపు పొంగు ఉన్నట్టి కాలం అది.

ఎవరో అన్నట్టు నాయని వారు అందరూ 'నా'యన దగ్గవారు. భావ కవిత్వపు స్మృతులలో నాయని వారు మాయని వారు. నిరాడంబరమైన శైలితో భావచిత్రణలతో తనదైన ఒక మౌలిక తను నెలకొల్పుకున్నారు. ''పద్యాలు జీవితాన్ని చీల్చుకొని వస్తవి. అందు చేతనే అంత బాధాకరంగా ఉంటవి. గుండెలకు తగిలేటట్టు చెప్తాడు, యత్నం లేకుండా'' అని ఆయన గురించి ముద్దుకృష్ణ 'వైతాళికులు'లో వ్రాసినది నాయని విశిష్టత.

వీళ్లకు కూలి డబ్బులిచ్చామనే అంటారా? జూటాకోర్లులారా నోరు మూసు కోండి. వీళ్లకు మీరెన్ని పైసలు చెల్లించారో, దానికి బదులుగా ఎన్ని కోట్లు మీరు సంపాదించారో చెప్పండి. మీ మోటారు కార్లు రోడ్ల మీద తిరుగుతున్నాయి, సముద్రాల మీద మీ ఓడలు పోతున్నాయి, రైలు దారుల మీద మీ పొగ రథాలు పరుగెత్తుతున్నాయి, నేల మీద ఫాక్టరీలు కిక్కిరిసి వున్నాయి; యివన్నీ ఎవరి కానుకలో కాస్త చెప్పండి. గంతలు తొలగించు కోండి, ప్రతి యిటుక మీదా జబాబు కనిపిస్తుంది. మీకయితే తెలియదు కాని, ప్రతి ధూళి నలుసూ ఎరుగును మానవ త్యాగ దృష్టాంతం ఆ ఓడకు, ఆ రథానికి, ఆ కట్టడానికి అర్థమేమిటో. (నజ్రుల్ ఇస్లాం)

# వెలుగు వెల్లువ

ఈదుసూరి నరసింహా రెడ్డి

చుట్టూరా విచ్చుకున్న శూన్యంలోకి
చొచ్చుకొని వస్తున్న నిశ్శబ్ద స్రవంతి;
ఇదేమిటి ?

ఈ లోకం గది యింత చీకటి!
ఏ మనిషి వెలుగు మీటల్ని నొక్క-
అరుస్తున్న నిశీధిగొంతు నొక్క-డేమిటి ?
ఇక్కడ జడత

నగ్నంగా, ఉద్విగ్నంగా నర్తిస్తుంటే
అగ్ని గుండంలా మండవలసిన
గుండెలన్నీ

చలనం లేని కళ్ళతో
పగిలిన కలల గాజు పలకలలోకి చూసి
భయోద్విగ్నంగా విలపిసా యెందుకు ?
ఉషస్సు చూసేందుకు మీరంతా
ముఖం వాచి లేరూ ?
మరింకా నిషా కళ్ళతోనే
నిట్టూర్పుల వోదార్పుతై
వెదుక్కుంటున్నా రెందుకు ?

అటు చూడండి.
ఈ చీకటి పరదాపై
వెలుగు రంగులు పులిమే
చైతన్య చిత్రకారుణ్ని
ఎవరో దారుణంగా హత్య చేస్తున్నారు.
రండి !
ఈ చీకటి లోకంలో బ్రతుకుతున్న
మీకు
వెలుగు కాగడాలు తీసుకొని ఎవరో
ఎదురొస్తారని
కలలు కంటూ కన్నీళ్ళతో
ఎదురు చూడకండి
మీ కళ్ళే
మిమ్మల్ని నడిపించే దివిటీలు !

అవును.
అన్యాయాలకు అనుస్పందించే
ప్రతి గుండే
సూర్యునిలా మండి నప్పుడు
చీకటి నిండిన కళ్ళే
చైతన్యంతో మెరుస్తాయి.
భవిష్యత్తులోకి నడిచేందుకు
దారి పొడుగునా వెలుగు దివిటీలు
కాంతుల్ని పరుస్తాయి.
క్రాంతి ద్వారాల్ని తెరుస్తాయి.

లెండి! యిక చాలు ; మెదడు కున్న
జడత్వం సంకెళ్ళు నేడైనా విరిస్తే
పది వేలు.
స్తబ్దతా గ్రహణం బారినుండి విడివడి
ప్రభాత సూర్యునిలా కదిలితే మేలు.

నేడు మీకు వుండవలసింది
స్పందించే హృదయం ;
భవిష్యత్తులోకి చూసే కళ్ళు
వెలుగు వెల్లువ
అడ్డుకునే వ్యవస్థ గోడల్ని
పగుల గొట్టే ఉక్కు పిడికిళ్ళు.

మీ గమ్యం ఉషస్సు
సకల జన శ్రేయస్సు.

మహిళల పట్ల మగవాని దృక్పథాన్ని బట్టి అతని సంస్కారం ఏపాటిదో మనం అర్థం చేసుకోవచ్చు. – మాక్సిం గోర్కీ

# కళ గురించి టాల్‌స్టాయ్

ప్రపంచ ప్రసిద్ధ రష్యన్ రచయిత లియో టాల్‌స్టాయ్ జన్మించి యీ సెప్టెంబరు 9 వ తేదీకి 150 సంవత్సరాలయ్యింది. సారస్వతానికి ఆయన చేసిన సేవను స్మరిస్తూ "కళ అంటే ఏమిటి?" "అయితే మనం చెయ్యవలసిందేమిటి?" అన్న ఆయన రచనలలోని కొన్ని భాగాలివి.

భవిష్యత్తులో కళ, యిప్పటి కళకు కొనసాగింపుగా వుండదు. అది పూర్తిగా కొత్త పునాదులపైని వృద్ధి చెందుతుంది. సోదర భావంతో సమైక్యత దిశగా ప్రజలను తీసుక వెళ్లే భావాలను, లేదా ప్రజలను ఏకం చేసే అటువంటివే సమాన భావాలను ప్రతిబింబించే రచనలు మాత్రమే నిజమైన కళగా పరిగణింప బడతాయి. ఇప్పట్లాగా కొద్ది మంది ధనికులు మాత్రమే కాకుండా, అప్పుడు సర్వ ప్రజలు కళలో నిష్ణాతులవుతారు. ఒక కళా రచన గుర్తింపబడి, ఆమోదింపబడి, ప్రజలలో వ్యాప్తం అవడానికి అది సర్వ ప్రజల అభిలాషకు, సహజమైన పని పరిస్థితులలో జీవించే అశేష ప్రజా బాహుళ్యం అభిలాషకు అనుగుణంగా వుండాలి.

కళాకారులు కూడా ధనిక వర్గాలకు చెందిన ఏ కొద్ది మందో, లేదా యిప్పట్లాగా వారికి సన్నిహితులో అయి వుండరు. కళా రచనకు ప్రతిభ, కుతూహలమూ వుండి, ప్రజాబాహుళ్యంలోని ప్రతిభాశాలురందరూ కళాకారు లవుతారు. కళాత్మక కార్యకలాపాలప్పుడు, ప్రజాహుళ్యానికి అందుబాటులో వుంటాయి.

ప్రజలకు కళా రచనలు, వాటిని వారు అర్థం చేసుకోలేరు గాబట్టి, యిష్టంగా వుండవని తరచు చెప్పబడుతోంది. కాని కళారచన కళాకారుడు స్వయంగా పొందే అనుభూతులను ప్రజలకు అంకురింపజేసే లక్ష్యంతో వున్నదయితే, అది ప్రశంసింపబడకుండా ఎలా వుంటుంది? విసుగెత్తించేవి తప్పితే కళారూపాలన్నీ మంచివేనన్నారు ఓల్టేర్. అవగాహన కానివీ, లేదా ఫలితం కలిగించనివీ తప్ప, సకల కళా రూపాలూ మంచివేనని చెప్పడం, యింకా సహేతుకం!

మన కాలంలో విద్యావంతుల గుంపు అజ్ఞానం ఎంతగా వుందంటే ప్రాచీన కాలాలకూ, 19 వ శతాబ్దానికి చెందిన నిజమైన గొప్ప చింతనా పరులు, కవులు, రచయితలూ వెనుకబడి వున్నవారిగా; అంచేత నేటి ప్రజల ఉదాత్తమైన నాగరికమైన అభిరుచులను సంతృప్తి పర్చలేనివారిగా పరిగణింపబడుతున్నారు. నేటి ప్రజలు వారిని తిరస్కార భావంతోనో, లేదా సరేలే అన్నట్టుగా చిరునవ్వు పారేసో చూడడం జరుగుతున్నదన్న అభిప్రాయం వుంది ... అర్థంలేని, కృత్రిమ పదాలు, ఛందస్సు, లయప్రాయంతో దండగా కూర్చినవి కవిత్వంగా పరిగణింపబడుతోంది. నాటక సమాజాలన్నీ ఆడుతూ వున్న నాటకాల అర్థం ప్రేక్షకుల కెంత అయోమయంగా వుంటోందో, నాటక కర్తకులకు అంతగానూ అయోమయంగా వుంటోంది. వస్తువు, కళాత్మకత లేని నవలలు సారస్వతంగా రుద్దబడుతూ, మిలియన్ల ప్రతులలో ముద్రణ జరుగుతోంది.

బెంగాలీ కవితాకాశంలో తటిల్లున మెరిసి, యిరవై ఒక్క సంవత్సరాల అల్పాయుష్షుతోనే సమసిపోయిన జీవిత్వం సుకాంత భట్టాచార్యది. రెండో ప్రపంచ యుద్ధ కాలంలో లక్షలాది మంది బెంగాల్ గ్రామాలలోంచి తిండి కోసం కలకత్తాకు వలస వస్తోన్న దారుణమైన రోజుల్లో సుకాంత భట్టాచార్య కరువు నివారణ కార్య కలాపాలలో ప్రవేశించి అన్నార్తులకు సేవచేశారు. తరవాత అయన అనేక ప్రజోద్యమాలలో కార్మిక సంఘ కార్యకర్తగానూ, ఫాసిస్టు వ్యతిరేక, సామ్రాజ్య వాద వ్యతిరేకోద్యమాలలోనూ పాటుపడ్డారు ; అఖిల భారత విద్యార్థి సమాఖ్యలో పనిచేశారు. ప్రజానాట్య మండలి కోసం రాజకీయ గేయాలూ, నాటకాలు రాశారు. బెంగల్ కరువు గురించి 'అకాల్' (కరువు) అన్న బెంగాలీ గీతాల సంపుటాన్ని సంకలనం చేశారు. బెంగాల్ కమ్యూనిస్టు పార్టీ పత్రిక 'స్వాధీనత' బాల విభాగానికి సంపాదకుడుగా వున్నారు. క్షయరోగంతో మంచం మీద ఉన్నప్పుడు కూడా అయన తన కవితా రచనను మానలేదు. అయన 1943 – 1947 మధ్య కాలంలో రాజకీయ, ఆర్థిక, సాంఘిక ఘటనలపై రాసిన కవితలు ఎంతో ప్రసిద్ధమైనవి.

# అర్హత

## సుకాంత భట్టాచార్య

ఏ వేళ రాత్రి పుట్టిన
పసికందు నోటినుంచి
నా కొచ్చిన సందేశమిది :
అవును, అర్హత వచ్చింది వాడికి.

అంచేత పుట్టీ పుట్టగానే
కొత్త లోకపు గుమ్మం దగ్గిర
తన హక్కును ప్రకటిస్తాడు
చెవులు చిల్లులు పొడిచే ఏడుపుతో.

వేలంతవాడు, నిస్సహాయుడు –
అయినా
బిగించిన పిడికిళ్లు పైకెత్తి
ఏదో తెలియని,
ఎవరికీ అర్థం కాని ప్రతిజ్ఞను
చాటి చెపుతాడు –
కొందరు చిరునవ్వుతారు
కొందరు ముద్దుగా మందలిస్తారు.
కాని నాకర్థమయినట్టే వుంది.
ఇంకా పుట్టని యుగ సందేశాన్ని
తనతో తెచ్చాడు వాడు.
వాడి లేత కళ్ల తెరమీద చదివాను
వాణ్ని పరిచయం చేసే ఉత్తరాన్ని.

నూతన యుగ శిశువు వేంచేశాడు
వాడికో తావును సిద్ధపర్చాలి.
అంచేత చివికిపోయిన ప్రపంచం వాళ్ల(
విసిగి వేసారిన చచ్చిన వాళ్ల
చెత్తా చేదారాల
నెత్తికెత్తుకొని పోవాలి, తప్పదు.

నాకు సంబంధించినంత వరకూ
సిద్ధమే నేను పోడానికి
కాని బొందెలో జీవం వున్నంత దాక
ప్రాణాన్నే పణమొడ్డుతాను –
లోకమంతట్నీ కంగాళీ చేసిన
కుళ్లను తుడిచి పారేస్తానని.

కొత్త శిశువుకిదే నా గట్టి వాగ్దానం :
నువ్వు జీవించేందుకు తగ్గ తావుగా
పరివర్తన చేస్తానీ ప్రపంచాన్నేను,
నా కర్తవ్యమంతా నెరవేర్చాక
నా కవోష్ణ రుధిరంతో
పసికందుకు పవిత్ర స్నానం చెయ్యిం(
దీవిస్తాను.
చరిత్రలో తెరమరుగవుతాను తరవాత

(బెంగాలీ నుంచి క్షితీష్ రోయ్ ఆంగ్లానువాదనికి ఆంధ్రీకరణ)

అవాస్తవికమూ, విద్యావ్యాప్తికి ప్రతిబంధకమూ అయిన గ్రాంధిక భాషను గద్దె మీంచి దింపి, వ్యవహారిక భాషకు పట్టాభిషేకం చేసిన గిడుగు రామమూర్తి గారిని ప్రశంసిస్తూ, అర్ధ శతాబ్దం క్రితం తమ శతావధానాలతో ఉర్రూతలూగించిన తిరుపతి కవులలో ఒకరైన చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు రాసిన దానిని ('కథలూ – గాథలూ'; రెండో సంపుటం; 1959) ఒక మిత్రుడు 'అభ్యుదయ'కు పంపించారు. ఈ ప్రస్తావన శీర్షిక 'గిడుగా? పిడుగా?' (పుటలు 379 – 80 ; 387 – 88). "గ్రాంధికం కన్న వ్యావహారానికి బలం ఎక్కువ అనే అంశం కవి మరువకూడదు" (పూ.పుట 872) అన్నది శాస్త్రిగారి ఉపదేశం.

# గిడుగు గురించి చెళ్లపిళ్ల

అది యెక్కడ పరిశీలనా జ్ఞానమో? వొక్కొక్క శబ్దాన్ని యెత్తుకొని వర్ణ త్రయాలు వ్రాయడం మొదలెడితే, వంశ వృక్షాలు వ్రాయడం మొదలెడితే, అదే వ్రాయడం, అదే వ్రాయడం. ఆ వ్రాయడంలో వక్క అక్షరం కూడా సూటి తప్పినదంటూ వుండదు. అదెక్కడి పాండిత్యమో? నిజంగా గ్రాంధిక కవుల మని పేరు పెట్టుకున్న వాళ్లందరూ ఆత్మవంచనలేని వాళ్లే అయితే ఒక మహాసభ చేసి వారి వారి బిరుదాల్ని పంతుల వారికి సమర్పించి ఆయన అనుగ్రహించి మళ్లా యిచ్చేటట్టయితే అలంకారార్థం ధరించుకోవలసిందే కాని లేకపోతే వదులుకోవలసిందే . . .

విద్యా విషయంలో అభిప్రాయ భేదాలు వున్నప్పటికీ, ఆడరాని మాటలు ఆడడంగాని ముఖముఖాలు చూచుకోక పోవడంగాని విద్వల్లక్షణంకాదు... ప్రస్తుతం గిడుగు వారు కూడా అలాగే వుంటారు గాని విద్యావిషయక మత భేదాన్ని పుచ్చుకొని లేశమున్నూ ఎడ మొఖము పెడ మొఖము అన్నట్లుగా వుండరు. ఇది నేను స్వానుభవము మీద తెలుసుకున్నాను. మళ్ళా కలంచేత బట్టినప్పుడో! యెంత గాఢంగా విమర్శించాలో అంత గాఢంగానూ విమర్శించి కాని వదలరు . . . మొదటికేనా సౌమనశ్యం అవశ్యకం గదా! అట్టి సౌమనస్యం యెంత ఉండాలో అంతా పంతుల వారి యందు మూర్తీభవించి ఉందని కాని లేదా సౌమనస్యమే యీ స్వరూపంగా అవతరించిందని కాని నేను విశ్వసిస్తూ వున్నాను. ఇట్టి మహనీయుణ్ణి గ్రామ్యభాషా వాదియైనంత మాత్రం చేత గాని, వారి వారి గ్రంథాల్లో నిజమైన తప్పులు చూపించడమనే హేతువు చేత గాని నిరసించడం కన్న పామరత్వ మింకొకటి వుండదు. అవసరాన్ని బట్టి నేటి కవులనే కాదు, ప్రాచీన కవులనే కాదు యీయన వక వూపు వూపి చూచిన మాట నిజం. ఆయన పెట్టిన వాతలు శాశ్వతంగా నిలిచిపోయేవే కాని యేవో వెక్కిరింపు మాటలతో అంతరించేవికావు. యితరులతో పాటు మాకున్నూ ఆయన వాతలు స్వల్పంగా తగిలి వున్నాయి. అందులో కొన్ని సవరణవు తాయేమో కాని కొన్ని దిద్దుకోవలసిందే. నేను పిడి వాదానికి వుపక్రమించే వాణ్ణి కాను కాబట్టి యదార్థం వ్రాస్తూవున్నాను. . . . నాలాగే తక్కిన వారు కూడా పంతులవారి ఆక్షేపణలు దిద్దుకుంటూ వారికి భాషా చరిత్రలో యెంత గౌరవం యివ్వాలో అంత గౌరవమున్నూ యివ్వడం ఆంధ్ర భాషాభిమానులందరికీ విధి. వ్యావహారికం వారు శ్రీవారి నిదివరకే గౌరవించి పూజిస్తూ వున్నారు. నేనిప్పుడు చెప్పేది గ్రాంధిక భాషా వాదులు కూడా వారికివ్వ తగ్గంత

నేటి యువకుల కవితలలో శిల్ప బంధురంగా ప్రతి వాక్యాన్నీ తీర్చి దిద్దుకో గలిగే నిమగ్నత కానరావడం లేదు. కవితలోని ప్రతి వాక్యాన్నీ ఆలోచనలు మేల్కొల్ప గలిగే మేల్బంతిగా, రమణీయోక్తిగా మార్చుకో గలిగినపుడే మన అభ్యుదయ కవిత్వం జన హృదయంలో చిరావాసం పొంద గలుగుతుంది.

ఆ కిటుకు తెలుసుకుందుకు పాశ్చాత్యదేశాల అభ్యుదయ కవులను అధ్యయనం చేయాలి. ముఖ్యంగా సోవియట్ విప్లవ కవి మయకొవిస్కీని (1893 - 1930)

# మయకొవిస్కీ

## సోమసుందర్

అధ్యయనం చేయాలి. కవి కాదలచిన వాడు సర్వోత్తమ పాఠకుడు కావాలి. తన్నుతాను నిరంతర విద్యార్థిగా గుర్తించుకోవాలి.

మయకొవిస్కీ 1905 నుంచీ దఫ దఫాలుగా విజృంభించిన రష్యన్ ప్రజాభా విప్లవాలకు గొప్ప వనా ప్రతిబింబాలను నెలకొల్పాడు. తన కవితల ద్వారా, కళాసిద్ధాంతాల ప్రచారం ద్వారా, ఆచరణ ద్వారా విప్లవ ధీశక్తికి ఆవిష్కరణ కలిగించిన వాడు. అతని వ్యక్తిత్వం సర్వతో ముఖమైనది. ఎంత విప్లవావేశం తన హృదయంలో పొంగులువారుతున్నా, తాను ప్రధానంగా కవితా కళాకారుడ నన్న చైతన్యాన్ని విస్మరించలేదు. శాబ్దిక కళే తన ప్రధాన ప్రమేయమనీ, ముఖ్యంగా కవిగా తాను వర్తమానంపట్ల ఎంత బాధ్యత గలవాడో, భవిష్యత్తుపట్ల కూడా అంతే బాధ్యత కలవాడననీ యేమరలేదు. కనుకనే మయకొవిస్కీకి కవిత్వ పరుసవేది లభించింది.

> " I once again glorify men
> Bed - ridden like hospitals
> And women worn - out like proverbs."

అంటాడు మయకొవిస్కీ. ఇది స్థూల దృష్టికి ఉద్ఘాటన లాగే కనిపిస్తుంది. కానీ ఆలోచనా పరుడైన పాఠకుని అంతరాంతరాలను పట్టి విడువదు. ఎన్నో ఆలోచనా తరంగాలను జాగృతం చేస్తుంది. ఎంతో భావుకత్వాన్ని ఉద్దీప్తం చేస్తుంది.

తాను మానవులను మహత్త్వపూర్ణం చేస్తాడు. అయితే ఆ మానవులెట్టివారు? వర్తమాన లోకంలో ఆసుపత్రులవలె శయ్యాగ్రస్తులై పడివున్నారు. ఆసుపత్రులే Bed - ridden అయినట్లుగా అతను సంకేతిస్తున్నాడు. కారణం ఆసుపత్రుల నిండా శయ్యాగ్రస్తులై మూలుగుతున్న రోగులుంటారు కనుక! వర్తమాన మానవజాతి యావత్తూ రోగగ్రస్తమై మూలుగుతోంది. కనుకనే విప్లవ పంథా ద్వారా పీడనా రహిత సమ సమాజం లోనికి మానవజాతిని సముద్ధరించాలి. అదీ అతనన్న GLORIFY లోగల అంతరార్థం. అలాగే అతను ప్రస్తుతించే స్త్రీలు ఎలాఉన్నారు? సామెతల వలె మంది నోళ్ళలో పడి నలిగిపోయి వున్నారు. తరతరాలుగా సామెతలు ప్రజల నోళ్ళలో పడి వాడగా వాడగా నలిగి వాడిపోతాయి. అలాగే స్త్రీలు సైతం సమాజ చక్రంలో చిక్కి నలిగిపోతున్నారు. తేజోవిహీనంగా వాడి వత్తలై పోయింది స్త్రీజాతి. ఈ రెండు అల్పమైన ప్రతీకాత్మక పద చిత్రాలపై

మయకొవిస్కీ అమేయ భావనా భారాన్ని మోపుతున్నాడు. ఉత్తమ కవితా కాంతితో శాశ్వతత్వం కలిగిస్తున్నాడు. కాలమనే క్రిమి దష్టం కాకుండా కవిత్వాన్ని కాపాడే నాప్తలీను ఉండలు - పదచిత్రాలు - అంటాడు మహావిమర్శకుడు సి. ఎమ్. బౌరా.

పై వాక్యం సహృదయ పాఠకుని హృదయాన్ని విడువదు. ఎన్నో ఆలోచనా తరంగాలను జాగృతం (EVOKE) చేస్తుంది. ఇంత మనోహరంగా ప్రతి కవితోక్తినీ మలచగల జాగృతహృదయం ఉన్నవాడు కనుకనే మయకొవిస్కీ ఇలా అనగలిగాడు: We alone are the face of time. Time' s trumpet blares in our art of words. అంతటి మానసిక దారుఢ్యం అతనికి కవితా చైతన్యం కలిగించింది.

అతని ఉత్ప్రేక్షలు వాస్తవికతా భూతలం నుంచి ఉద్భూత మైనవి. అవి పఠిత హృదయంలో చేరినపుడు ఏక కాలంలో వాస్తవికతా భూతలాన్నీ, ఆదర్శ వ్యోమతలాన్ని ప్రదర్శిస్తాయి. లందడి చిత్తడిగా ఉన్న నేలలోంచి పుట్టిన పాద పాలవలె భావనా కుసుమ సంభరితాలవుతాయి. అంటే పాఠకహృదయంలో ఒకే కేన్వాసులో వాస్తవికతని, కల్పనా రమణీయతనీ పారదర్శకంగా ప్రదర్శిస్తాయని అర్థం. దీనికి ఉదాహరణంగా ఈ క్రింది వాక్యం పరిశీలిస్తే తేటతెల్ల మవుతుంది.

> " I would gnaw the nights
> with the light of my eyes."

కళ్ళ కుండే సహజ కాంతి ఈ లోకదర్శనానికి ఉపయుక్త మవుతుంది. అది నోటికుండే దంతపు సరికట్టువంటిది. ఎంత కఠోరమైన పదార్థాన్నైనా బలమైన దంతాలతో నమిలి వేయగలడు ఆరోగ్య వంతుడు. వర్తమానం కఠోర సమస్యా సంభరిత సంకుల రాత్రిగా దర్శన మిస్తోంది. కవి ద్రష్ట కాగలిగితే - ఆ రాత్రీ గత నికృష్ట సమస్యలను పరిష్కరించగలడు. సుందరాకృతి కల్పించగలడు. పైగా ఈ దుర్భర వర్తమానం భావుకుడైన కవికి సుఖశాంతులు లేకుండా చేస్తోంది. కర్తవ్యతా విమూఢ నిద్రాముద్రిత లోకాన్ని ఆవరించిన సమస్యలను - శాయ శక్తులా పరిష్కరించ చూచే కవి భావుకత్వం నిరంతర జాగృతం కాక తప్పడం లేదు. అలాంటి కవి - కఠోర రాత్రిని తన నయన కాంతులనె దంతాలతో నమిలి పరిష్కరించకనూ తప్పడం లేదు. ఇంత భావాన్నీ మయకొవిస్కీ ఒక్క Gnaw అనే పదంపై నిలిపాడు. అదే కవితా కౌశలం !

ఇలాంటి లఘుతర పదాలపై అలఘు భావనావ్రాతాన్ని దట్టించీ, అల్ప పాదాల భుజాలపై అమేయ భావుకత్వాన్ని మోపి - మయకొవిస్కీ ఇంతటి మహత్త్వపూర్ణ కవిత్వాన్ని అందించాడు. కనుకనే మహానుభావుడు ఏ. లునా ఛరస్కీ కంఠోక్తిగా ఇలా ప్రశంసించాడు : "Each line worth its weight in gold, because each has been discovered, each has been created." కనుకనే మన అభ్యుదయ కవిత్వానికి మయకొవిస్కీ నిరంతర ఆరాధ్యుడే !

# మా వూరు

## సోదుం రామ్మోహన్

రెమ్మ మీది పువ్వులా
యువతి మొహం మీది నవ్వులా
కృష్ణ ఒడ్డున విజయవాడ
ఎంత అందంగా వుందని !
మూడ్ మారే కొద్దీ
ముఖ భంగిమ మార్చే మగువలా
రుతువు రుతువుకో రూపం
దాలుస్తుంది మా వూరు
ఎండా కాలం మండిపోతూంటుంది
పన్రెండు దాటిందంటే
బయట మొహం చూపలేం
నిప్పు డెండల బారి పడితే
ప్రాణాల్నిక ఆపలేం
వర్షాకాలం వస్తే
హర్షం అనేదే లేదు మాకు
వూరంత బురద బురద
బురదతో పందుల సరదా
అబ్బో మా వూరి బస్సులు
అచ్చం హంతకులు
రేసులో గుర్రాల్లా సిటీ బస్సులు
పోటీగా పరుగెత్తి పరుగెత్తి
ఏ మూలో ఒక అభాగ్యుని
నెత్తురు కక్కిస్తాయి కర్కశంగా !
అదిగో అటు చూశారా
అది రామా టాకీస్ ప్రాంతం
అ వీధి అంతా పడుపు కత్తెల సొంతం
అటు అడుగు వేశావో సుఖం కోసం
వెంటనే కబురంపాలి డాక్టర్ కోసం
అదుగో అ ఎత్తుగా కనిపిస్తోందే
అదే ప్రకాశం బ్యారేజి !
రైతుల పాలిటి పంటల క్యారేజి !
అది ఇక్కడ వెలసి నప్పట్నుంచి
పంటలకు లేనేలేదు మిస్‌క్యారేజి !
ప్రొద్దున్నే బ్యారేజీపై
బస్సులో ప్రయాణిస్తోంటే
నల్లని నీటిపై మెల్లగా వచ్చి
చల్లగా నీమొహంమీద కొడుతుంది గాలి
ఎంత ఆనందంగా వుంటుందని
దాని పలకరింపు
ఎంత ఆహ్లాదంగా వుంటుందని
దాని చిలకరింపు
అదిగో బ్యారేజికి ప్రక్కన చూశారా
ఆ ఎత్తైన కొండ,
కొండమీద భవనం
దాని పేరే గాంధీ హిల్
దాని కిటుగా కనకదుర్గ గుడి
ఆ 'పవిత్ర' ప్రాంతంలో రాత్రిళ్లు
కామం కరుళ్లు కరుళ్లుగా
ప్రవహిస్తుందంటారు పరిశోధకులు
బిసెంట్ రోడ్డు నిరంతరం
బిజీ బిజీగా వుంటుంది
సాయంత్రం అటు వెళ్తే
కాసేపు సరదా
అన్నట్టు అబద్ధాల్ని వండే
వార్తా ప్రతికలు
అబ్బో బోలెడు మా వూళ్లో
ఇక్కడి సంపాదకులకు 'జాస్తి' బుద్ధి
ఉప సంపాదకుల దేమో 'కోతి' బుద్ధి
నమ్మవు కానీ మిత్రమా ఇది నిజం
మా వూళ్లో శ్రేష్ఠమైన వృత్తి రౌడీయిజం
ప్రతి బడుద్ధాయి మొలలో కత్తి
కోపమొచ్చి దిగేస్తే చాలు మిత్తి
పోలీసులు అసలు చేసుకోరు జోక్యం
రౌడీలతో తరుచు అవుతారు ఐక్యం
ఒక్క మాటలో చెప్పాలంటే
సిటీ బస్సు టైర్లకో
రౌడీల పిడి కత్తులకో
బలికాకుండా బతకడమే
మేం చేస్తున్న ఘనకార్యమంటా !

# భయ కారణం

**కథానిక**

ఎమ్. పార్థసారథి

మురళి అదృష్ట వంతుడు. అతడి జీతం ఎంతో చెబితే మీరు తప్పక అసూయ పడతారు. అంతే కాదు, 'పెర్క్స్' చాలా వున్నాయి వుద్యోగంలో. ఫ్రీ క్వార్టర్స్, ఫ్రీ మెడికల్ ఎయిడ్. రెండేళ్ల కోసారి విలాస పర్యటన. ప్రావిడెంట్ ఫండ్, చీటికీ మాటికీ అడ్వాన్సులు, అలవెన్సులు, అనేక రకాల సెలవులు. చకచకా ప్రమోషన్లు. ఉద్యోగం చెయ్యాలనుకున్న వాడికి యింత కన్నా యింకా ఏం కావాలి?

సరే, అతడికి పని ఎంత టైట్‌గా, వూపిరి సలపకుండా వుంటుందో అని గనక మీరనుకుంటే, అది మీ పొరపాటు. ఆఫీసులో వర్కు 'ప్రాసెస్' చెయ్యటానికి వాళ్లకు కొన్ని మాన్యువల్సూ, నిర్దేశ సూత్రాలూ వున్నాయి. వాటి ప్రకారం కళ్లు మూసుకొని పని చెయ్యాలి. చెయ్యాల్సిన ఏడుగంటల డ్యూటీలో రెండు గంటలు కూడా అతడు సరిగ్గా పనిచెయ్యడంటే మీకు ఎబ్బెట్టుగా కనిపించొచ్చు గాని అతిశయోక్తి కాదు. అవునంటే, వాళ్లాఫీసులో పన్లేదు. రోజంతా కబుర్లు, కాఫీలు, పత్రికలూ, పుస్తకాలు, కళాపోషణ, గేమ్స్, జర్నలిజం, నాటకాలు, ఫ్రీ స్టేషనరీ, ఫ్రీ టెలిఫోన్, ఫ్రీ టైపు రైటర్, స్టేటస్. ఇన్‌ఫ్లుయన్స్ – ఇది ఆఫీసు.

మురళి విద్యాసంపన్నుడు.

ఎమ్మెస్సీ పాసయ్యాడు. కాని పదేళ్ల వుద్యోగం తర్వాత చదువు కున్నదంతా మర్చిపోయాడు. ఇంటర్వ్యూలకు వెళ్లక్కర్లేదు గనక జనరల్ నాలెడ్జి యిప్పుడతడి కనవసరం. కాంపిటేటివ్ స్పిరిట్ ఎప్పుడో పోయింది. దిన పత్రికలు చూసేది సినిమాలు అడ్వర్టజుమెంట్ల కోసం. ఆఫీసు కరెస్పాండెన్సులో చాలా మట్టుకు 'ఫార్మ్స్' వుంటాయి. వాటిలో ఖాళీలు పూర్తి చెయ్యటం, అవసరమైన వాటికి టిక్కులు పెట్టటం, మిగతావి కొట్టెయ్యటం అతడి పని - ఇంగ్లీషు కాంపోజీషన్ యింకా జ్ఞాపకముందా? లెక్కలు చెయ్యటానికి మెషీన్లున్నాయి. అతడు డిస్పాచ్ సెక్షన్‌లో చాలాకాలంగా కవర్ల మీద అడ్రసులు రాస్తున్నాడు.

మురళి భయస్తుడు.

అతడిలా కావటానికి అతడికున్న బ్రహ్మాండమైన వూహా శక్తి కూడా కొంత కారణం. ఉద్యోగం పోతే ఎలా అనుకుంటాడు. ఇలా, తీరిగ్గా కూర్చోబెట్టి నెలకు పదిహేను వందలెవరిస్తారు? బద్ధకం పెరిగింది. పుస్తకజ్ఞానం, లౌకిక జ్ఞానం తరిగింది. 'పోటీ' మనస్తత్వం ఎప్పుడో పోయింది. ఖర్చులూ, విలాసాలూ, అశక్తతా పెరిగాయి. తను ఆఫీసులో చేస్తున్న పని సెకండుఫాం చదువుకున్న కుర్రాడెవడైనా చెయ్యవచ్చు. తన కింత జీతం రావటం కేవలం యాక్సిడెంట్. అర్హతను బట్టి కాదు. ఏ కారణం చేతైనా ఈ వుద్యోగం పోతే తనేం చెయ్యగలడు? శరీర శ్రమ చెయ్యలేడు. మరే నైపుణ్యమూ తనకు లేదు. ఎయిర్ కండిషన్డ్ ఆఫీసు అలవాటైంది. ఎండలో పని చెయ్యలేడు. క్వార్టర్స్ విశాలంగా వున్నాయి. ఇరుగ్గదుల్లో యిప్పుడుండ లేడు. ఆఫీసు

డిస్పెన్సరీలో మంచి మంచి ఖరీదైన మందు లిస్తారు. తనవన్నీ కొనుక్కో లేడు.

ఈ వుద్యోగం పోతే బైట ప్రపంచంలో పైసాకు గూడా మారడు. అందుకే ఇంత భయం. తనకూ అభిప్రాయాలున్నాయి. కాని పైకి చెప్ప లేడు. ఆఫీసర్ల మీద కోపమొస్తుంది. పైకి చూపించ లేడు. ఉద్యోగపు నిబంధనల నతిక్రమించి ఏంచెయ్యాలన్నా భయం. అర్హత లేని సుఖం మరిగితే మరెలాగుంటుంది? అద్దాల మేడ అందంగానే వుంది. కాని ఏ క్షణాన ఎవరు రాయేస్తారోనని భయం. అందుకే ఊపిరి బిగబట్టి, అడుగు తీసి అడుగు వేస్తూ ఒదిగి ఒదిగి నడుస్తున్నాడు. ఎప్పుడు కల చెదిరి పోతుందో నని భయం.

నిరుద్యోగ సమస్య ఇంత విపరీతంగా వున్న ఈ రోజుల్లో, జీవితానికి భద్రత లేని ఈ కాలంలో, పొట్ట గడవడమే అదృష్ట మనుకుంటున్న ఈ సమాజంలో ఈ సుఖభోగం ఎలా వరించింది? తన కన్నా తెలివైన వాళ్లు, ఎక్కువ అర్హత లున్న వాళ్లు, తనకన్నా తక్కువ జీతాలు తెచ్చుకుంటున్నారు. తనకన్నా బల మైన వాళ్లు రోజంతా కాయకష్టం చేసీ సగం కడుపుకే తింటున్నారు. అర్హత లున్న వాడు భయపడడు. ఇదికాక పోతే మరో పనిచేసి బ్రతుకుతా నను కుంటాడు. కాని తను వుద్యోగం లాటరీలో గెలిచాడు. ఈ సుఖం, ఈ జీతం యాక్సిడెంట్. షీర్ ఆక్సిడెంట్.

అదీ భయ కారణం.

# నెత్తుటి సూర్యోదయాలు

## దస్తగిర్

నగరం చీకటి ఒడ్డును ఒరుసుకుంటూ
నా అడుగులు వేగంగా
ప్రవహిస్తున్నప్పుడు
ఇళ్ళ సమాధుల నుండి వినవస్తున్నాయ్
ఏడ్పుల వెక్కిళ్ళు.
అవయవాలు మొలిచిన
మాంస ఖండాల నుండి
చౌకబారు సెంటు వాసనలు.
త్రాచుల్లా కాళ్ళను కాటేస్తున్నాయ్.
దుకాణాల్లో కంటే ఇక్కడ మాంసం
చాలా చౌక!
చుట్టూ దాహం కళ్ళతో నెత్తురు తాగి
వెళ్ళిన
తోడేళ్ళ అడుగు జాడలు.
చౌరాస్తా కాష్టంపై నాగరికత
శవంలా కాలుతున్న కమురు వాసన!
ఆవలి ఒడ్డున ..
కార్ఖానాల గేట్ల ముందు
పెదాలపై నినాదాల్ని పగడాల్లా
పడవేస్తూ బారులుగా చెమటోడ్చే వాళ్ళు
చెలరేగినపుడు-
వాళ్ళ బ్రతుకుల్లో ఉదయిస్తున్న
ఎన్నెన్నో నెత్తుటి సూర్యోదయాల్ని
ఇక్కడి పాలిపోయిన మొఖాలు
ఆశగా చూస్తున్నాయ్!!

# మార్పు

## మరా శాస్త్రి

ఎండ. వెర్రి ఎండ. పిచ్చి ఎండ. ఒళ్లుమండే ఎండ. మండి పోయే ఎండ. ధరలు మండు తున్నట్లు ఒకటే ఎండ. ఎమర్జన్సీ లాంటి ఎండ. మనిషి మనుగడకి ఎండ కావాలి. కాని, ఎండు కట్టెల్లా జీవుల్ని ఎండ కట్టేస్తూ, వడ కట్టించేస్తూ, ప్రత్యక్ష దేవుడు ప్రతాపం చూపిస్తూ, తాపం ఎత్తించేస్తూంటే – ఏ దేవుడు దిక్కు?

కాయ కష్టం చేసుకుంటే కాని, కడుపునిండని కార్మికుడు నిలబడేదెలా? రిక్షాలాగే వాడూ, బస్తాలు మోసుకునే వాడూ, తేలా లాక్కునే వాడు వీధిన తిరిగే దెలా?

సూర్యుణ్ణి చూడనవసరంలేని సుకుమారులు, రాకుమారుల్లాంటి కుబేర కుమారులు ఎయిర్ కండిషనర్ల ముందు, గుల్‌మార్గుల ముందు, పంకాల ముందు గడిపేస్తున్నారు. ఇంకా తట్టుకోలేని వారు ఊటీకో, సిమ్లాకో పోయి, వర్షం ఆరంభం అయాక తిరిగొస్తున్నారు. వాళ్లని సాధించలేక, సామాన్యుడి మీద సాధిస్తున్నాడు ప్రత్యక్ష సాక్షి.

అర్ధ రాత్రయినా చల్లబడదు. వేడి గాలి. వడగాలి. పేవుమెంట్లమీద, కొండ చెరియలమీద, గనుల్లో, వనుల్లో ఎందరు కళ్లు మూసేస్తున్నారు? నలిగి పోయిన తోట కూర కాడల్లా కోయబడి, వాడి పోయిన పూవుల్లా, కునికి పాటులా కునికి, కునికి, కన్ను మూసేస్తున్నారు. మరి, కన్ను విప్పరు.

అంతటు ఆక్రోశం! ఆక్రందన ఎప్పటికి విముక్తి? ఈ గ్రీష్మం నుంచి బయట పడడం వుందా? ఈ ఎమర్జన్సీకి ఎలక్షన్లున్నాయా? సామాన్యుణ్ణి చల్లబరిచే నేతలున్నారా? ఉన్నారు! ఉన్నారు! ఎవరు?

వారే – ఆకాశంలో అల్లంత దూరాన తెల్లని గాంధీ టోపీలు ధరించిన నాయకుల్లా వున్నారే, మేఘ రాజాలు, వారే!

అయితే – రండి! రండి! మీకిదే మా ఆహ్వానం. ఇవిగో మా ఓట్ల పూమాలలు. ఈ ఎమర్జన్సీ ఎండని తరిమి తరిమి, ఉరిమి ఉరిమి, మీ చల్లదనం మా మీద కురిపించండి!

ముక్త కంఠంతో, ముకుళిత హస్తాలతో ప్రార్థనలు!

మేఘరాజాలకి సందేశం వెళ్లింది. సంతోషంగా ముందుకు నడిచేయి. సామాన్యుడి కోసవే తామున్నట్లు ఆకాశమంతా పందిరిలా అల్లుకున్నాయి. ఎక్కడ చూసిన మేఘాలే! అన్నీ మేఘాలే! నల్లవి, తెల్లవి, నలుపూ, తెలుపూ కలబోసినవి. అన్ని కలిసికట్టుగా, ఒక్కటిగా, చిక్కగా, దట్టంగా చెట్టా పట్టాలేసుకుని అల్లుకున్నాయి.

ఆహా! చల్లబడింది. ఎండ ఏదీ? ఎమర్జన్సీ ఏదీ? లేదు! లేదు! ఇదీ మా కాలం! మామంచి కాలం! ఇంక మంటలు లేవు. చావులు లేవు! పగిలిన బీడులు, బీటల భూములూ లేవు. వచ్చింది మార్పు. తెచ్చుకున్నాం తెరిపిని. ఇక సామాన్యుడు – అసామాన్యుడూ భేదం లేదు. అంతా ఒక్కటే. అందరికీ చల్లదనమే. హాయే! ఆహా! ఓహోహో.

ఒక్కసారి చల్ల గాలి వీచింది.

మాట యిచ్చిన మేఘాలు వర్షించడం ఆరంభించాయి, జగతి పులకించింది. మేనులు పులకించాయి. అంతరాత్మలు శాంతించాయి. అక్కడ ఆగలేదు. వర్ష ధారలు మింటికి మంటికీ ఏక ధారలయేయి. ఆపూ అంతూ లేదు! ఏమిటీ ఉత్సాహం? ఏమిటీ వృష్టి? కుంభ వృష్టి!

ఏరులు ఏకమయి ఊళ్ల మీద పడ్డాయి. రాత్రికి పగటికి తేడా లేదు. అంతా కాంతిహీనమే, అంతా చీకటే, అంతా చల్లదనమే. అతి చల్లదనం. గడ్డ కట్టుకు పోయే చల్లదనం. చలిగాలి. పెనుగాలి. చీకటి, చిమ్మచీకటి, తుపాను! మెరుపు. కాంతి. దివ్యకాంతి. ఉప్పెన!

ఏమిటీ ప్రళయం? కోరుకున్న దేవిటి? జరిగిన దేవిటి? ఈ ప్రళయంలో, జలప్రళయంలో సామాన్యుడు నిలబడే దెలా? సామాన్యుడి కెప్పుడూ సుఖం - శాంతీ లేవా?

ఎంతో ఓర్పు వహించి, మార్పు నాశిస్తే, విధి యిచ్చే తీర్పు యిదా?

మార్పు అవసరంలేని, "మార్పు" లేదా? రాదా?

మార్చడంలోనే అంగలార్చి అంతమందాలా?

ఏలికలు మేఘమాలికలై, మేఘమాలికలు ఏలికలై, కలిసి కట్టుగ కసి తీర్చుకుంటుంటే - సామాన్యుడికి మిగిలింది సణుగుడు!

## చల్లా రాధాకృష్ణశర్మ
## మినీ కవితలు

### తారతమ్యం

నడి వీధిలో నిలబడి
కీచులాడు కుంటున్నారు
పల్లెటూరి వారు.

మేడ గదిలో కూర్చుని
ఘర్షణ పడుతున్నారు
పట్టణం వారు.

ఎందు కీ తారతమ్యం ?

పల్లెటూరి మురుగు కాలవలు
నేలమీదనే ప్రవహిస్తాయి.
పట్టణం మురుగు కాలవలు
నేల కింద ప్రవహిస్తాయి.

### మరణ భయం

కన్ను తెరిచిన ప్రతి జీవి
కన్ను మూయక తప్పదు
నిన్నటిదా మొన్నటిదా
ఈ సత్యం?
ఎన్నటిదో, ఎవరికి
తెలియదు.

అయితే, మరణాన్ని చూచి
హడలి పోతున్నా

ఎందుకు ?
కుమిలి పోతున్నా
ఎందుకు ?
భయం
మరణ భయం!

### భేదం

ఆ వినాయకుడు
భుక్తి సులభుడు
ముక్తి ప్రదాత!

మా నాయకుడు
భుక్తి సులభుడు
సూక్తిప్రదాత!

కుక్కకి ఓ ఎముక పారెయ్యడం దాతృత్వం కాదు, నువ్వూ ఆ కుక్కంత ఆకలిగా వున్నప్పుడు దానితో కలిసి ఆ ఎముకను పంచుకోవడంలోనే వుంది, అసలు దాతృత్వం. (జాక్ లండన్)

"నా మాటలు – మనస్సులో పొరలు దాటి
అంతరాత్మలో అర్థవంతాలై
మానవ జీవన వ్యూహంలో
అమృత కాంతి వర్షంతో

నవ నవోన్మేష సంజనా కృతి, నొందుతాయంటూ 'వర్తమాన మానవ జీవిత వైవిధ్యాన్ని శాస్త్రీయంగా దర్శించి, ప్రతీకాత్మకంగా, కళామయంగా కవితలల్లుతున్న ప్రముఖులు డా॥ మాదిరాజు రంగారావు గారు.

# మాదిరాజు కవిత విశ్వైక్య మానవత

శివలెంక ప్రకాశరావు

ఇప్పటికి సుమారొక డజను కవితా సంపుటాలుగా వెలుగులోకి వచ్చిన వీరి కవిత్వం రసజ్ఞుని అంతరంగాన్ని కదిలించి, ఒక అనిర్వచనీయానందాన్ని ప్రసాదిస్తుంది. ఎందుకంటే మాదిరాజు వారి మనస్సు 'నటత్తరంగ శ్రేణులతో తలయెత్తి నిల్చిన సముద్రం.' ఆయన ఊహ 'జనతాగాథా కల్లోలంగా శివమెత్తిన గంగ'[2]. ఒక 'యుగ సంకేతం'గా ఈనాటి అశాంతి ఆక్రందనంలో రేపటి అభ్యుదయం కోసం అగ్నియై మేల్కొని, వర్షమై బ్రతుకుతా'[3]డీ కవి. ప్రగతి శీలం ఆయన వర్తనం – మెలకువ ఆయన విప్లవం. అయన చేయి శక్తికి ప్రతీకయితే, మాట ఎద మ్రోత. అందుకే డా॥ మాదిరాజు 'భవిష్యత్తుకొక సిగ్నల్. నవ ప్రగతికొక సింబల్'[4].

ప్రవాహతత్త్వంతో నిరంతరం ముందుకు సాగే కాలాన్ని, భూత భవిష్యద్వర్తమానాలనే త్రికాలాలనూ, 'కడలిలా నిలిచిన సనాతన వృక్షం' క్రింద మనుగడ సాగిస్తూ, నిరంతరాన్వేషణాసక్తతతో 'పరిస్థితుల ప్రబల శక్తికి కదలుతున్న క్రియారూపాలు'గా, 'కాల సూత్రానికి గుచ్చిన పుష్పాలు'గా ఉన్న మానవుల చరిత్రను దర్శించిన తత్త్వవేత్త రంగారావు గారు.

అందుకే 'జీవితమొక చివర తెలియని చీకటి వంతెన' అనీ, లెక్కలేని 'అనుభవాల వెలుగుమెట్లపై' పయనించిన మహానుభావుల 'పాదముద్రలే చరిత్రలో నిలిచిన స్మృతుల'నీ, వారు కాల గగనంలో ఎగరేసిన 'యశః పతాకాలే'[5] మనకాదర్శమనీ అంటారీయన.

మనిషి మనసులో మూడు పొరలున్నాయి. అవి వ్యక్తం, వ్యక్తావ్యక్తం, అవ్యక్తం. మొదటి దానిలో నిజ జీవితాన్ని, రెండో దానిలో ఆదర్శ జీవితాన్ని అనుభవించి, ఆ రెంటినీ సమన్వయ పరచుకొని మానవుడు ముందుకు సాగుతాడు. 'అతని మనస్సు సంస్కృతికి గతి బిందువు, అతని ప్రవర్తన ఆకృతికి రేఖాంతరం.'[6] ప్రకృతిలోవలె మనిషిలోనూ జడత్వం, చైతన్యం ఉన్నాయి. అందుకే మనిషి మనసులో నిశ్శబ్దం ఉన్నా, ముఖంలో శబ్దం తాండవిస్తుంది. అజ్ఞానాంధకారం నుంచి విజ్ఞానయుగంలోకి మానవుడు చేసిన ప్రయాణమే

నిశ్శబ్దంలోంచి శబ్దంలోకి రావడం. అదే జడస్వరూపంతో ఉన్న ఆది మానవుడు నవ నాగరికుడుగా పొందిన మార్పు. 'బీజనాశం నుండి మొక్క - పుష్ప పతనం నుండి ఫలరూపం - తమస్సు నుండి ఉష ఆగమనం.'[7] అలాగే 'ఎన్ని రోజులు గడిస్తే - అన్ని రేకులతో జీవిత కాల పద్మం' వికసిస్తుంది. ఇదే ఆనాదిగా కొనసాగుతున్న మానవ చరిత్ర.

ఈ చరిత్రలో వ్యక్తి, సంఘం పరస్పరాశ్రయాలు. వ్యక్తి సంఘానికి వెన్నెముక. సంఘం అతని జీవన విధానానికి ఒక ప్రాతిపదిక. వ్యక్తిగత వికాసమూ, సంఘాభివృద్ధీ పరస్పరం ముడివడి ఉన్నాయి. అందుకే కవి 'వ్యక్తి సంస్కారంతో సమాజం సంస్కృతమౌతుంద'నీ, 'వైయుక్తిక చైతన్యం సామాజిక అభ్యుదయానికి మొట్టమొదటి ఆశాకిరణ'[8]మనీ అంటాడు.

ప్రతి మానవుడూ ఒక 'మహా సంస్కృతీ పరంపరకు వారసుడు.' అయినా ఒకనాడు 'సంస్కృతీ నిలయాలుగా వెలిగిన జ్యోతీరూపాలు' ఈనాడు 'భస్మ వేదికలు'గా మారుతున్నాయి. అబ్దాల సంస్కారానికి ఆటపట్టయిన జీవనో ద్యానాలు శ్మశాన వాటికలుగా 'గీ' పెడుతున్నాయి. 'మనస్సులో గ్రీష్మం అహంలో స్వార్థం' తాండవిస్తున్నప్పుడు మనిషి ఎలా ప్రవర్తిస్తున్నాడో, వియత్నాంలో అమెరికా, బంగ్లాలో పాక్ దురాగతాలు స్పష్టం చేస్తున్నాయి.

అమెరికా సైంటిస్టులు 'రాజకీయ విక్రేతల చేతుల్లో చదరంగంలో పావుల వలె' ప్రవర్తించడం వల్ల 'నేపాల్మ్ బాంబులు' విలయ నృత్యం చేసి 'అర్ధ నగ్న శరీరాలతో వియత్నాం వీధుల్లో'[9] ప్రజలను పరిగెత్తించాయి. అలాగే 'బాంబుల వర్షంతో శాంతిని పండించాలనీ, అహం బలం దాహంతో మానవత రక్షించాల'[10] అనుకున్నాడు పాక్ నేత. కాని కాలం కలసి రాలేదు. చరిత్ర సంపుటిలో 'చీకటి పుటలు చిరిగిపోయాయి. 'అమార్ సోనార్ వంగ దేశం' అవతరించింది. కాని నేలపై సైనికుల అడుగులు 'ఇసుకలో గుచ్చిన కత్తులవలె' గత చరిత్ర నింకా గుర్తు చేస్తూనే ఉన్నాయి. అవి మానవత్వం దానవత్వంగా మారిన వాటికి చెరిగిపోని గుర్తులు. అందుకే - 'మనసులో ఆవేదన స్వరమై బుద్ధిలో విజ్ఞానం వెలుగై రావాలి మనిషికి' అని అంటాడు కవి.

'నదిలో ఆర్ద్రత వలె' మనిషి మనసులో అనుభూతి ఉంటుంది. ఎప్పుడు అనుభూతి ఉంటుందో అప్పుడు మమత ఉండి మానవత వెల్లివిరుస్తుంది. 'స్ఫటికం వంటి మనస్సుతో - ఉషస్సు వంటి ఊహతో' మేల్కొన్నప్పుడే మనిషిలో మానవత ఫలవంతమవుతుంది. అంటే మానవత మనిషి మనసులో, అనుభూతి అతని భావనలో ఉన్నాయన్న మాట. కాబట్టి మన లోకాన్ని స్వర్గంగా కాని నరకంగా కాని రూపొందించుకునే శక్తి మనిషి చేతల్లోనే, చేతుల్లోనే ఉంది.

అందుకే - 'మానవత వధ్యశిలపై ఉన్నా' చక్రనేమి క్రమణంలో మనిషి స్థితి చక్కబడక పోదని చాటిచెబుతూ

'రేపులో విశ్వాసముంచు
నిన్నను విస్మరించకు
గతజల సేతు బంధనంలో

జీవిత లిప్తలు గడపకు'[12] అంటాడు కవి.

మానవతకు నవత కూడా ఒక లక్షణం. 'రవి తేజంవలె ఊహలో-మాటలో-వర్తనంలో ప్రవర్తిస్తూ నిరంతరం జడత్వం పోగొట్టేదే నవత.'[13] మానవాత్మ నుండి శక్తిని పుంజుకునే సంస్కృతి యొక్క వెలుగు బాటలలోనే నవత పండుతుంది. కాని ఈనాడు నవత పేరుతో నాగరికత వెర్రితలలేస్తున్నది. సంస్కృతి ఒక దీపమయితే దాని చిమ్మినీ గ్లాసు నాగరికత. గ్లాసును బట్టి కాంతి ఉంటుంది. సంస్కృతి మనిషి ఆత్మ ధర్మం. నాగరికత అతని దేహ ధర్మం. మొదటిది ఆధ్యాత్మిక వికాసంలోనూ, రెండోది వేషభాషల్లోనూ ప్రకటితమవుతుంది. అనాదిగా జాతులూ, సంఘాలూ భౌతికంగా, మానసికంగా ఔన్నత్యాన్ని పొందడానికి చేసే నిరంతర కృషి ఫలితమే సంస్కృతి. అది మానవ చరిత్రకు ఒక బీజంగా, సంఘైక్యానికి తోడ్పడుతుంది.

కాని ప్రస్తుతం నాగరిత విపరీతంగా సంస్కృతిని ప్రక్కదారి పట్టించడంతో ఆయుధాల అవసరం పెరిగి మనుషుల మధ్య అఖాతాలు ఏర్పడ్డాయి. ఎక్కడ చూచినా శూన్యదృక్కులు బరపే 'పెద్దమనుషుల లాంతరు ముఖాలు', 'గాలికి మ్రోగు ధ్వజస్తంభ ఘంటికల' వంటి అనాది సిద్ధ వాసనా కృతులు, చీకటి పొరలు కప్పుకున్న 'జీరో విలువల బ్రతుకులు', జీవన సమరంలో వెనకబడ్డ 'ఫ్రీ ప్యాసింజర్లు' 'పహలీకి' ఎదురు చూచే ఉద్యోగులు, ఉద్యోగం కోసం ప్రమోషన్ల కోసం బార్లుతీరిన నిరుద్యోగుల బొమ్మలు. అందుకే 'ఒక్కొక్క ముఖం ఒక్కొక్క సైన్‌బోర్డు'[14] అని అంటాడు కవి.

ఈ అశాంతికీ, అసహనానికీ సాంఘికంగా మనుషుల మధ్య అంతరాలు సృజించబడడం, మానవత స్థానం దానవత ఆక్రమించి స్వార్థపూరిత 'ఫ్యూడల్' వాతావరణం ఆవరించడం ముఖ్య కారణాలు.

అదీకాక మన జీవితాలు 'కాలపు సూది బెజ్జం నుండి సాగిన ఆయుః సూత్రానికి నీడ మెడలతో, వెన్నెల ముఖాలతో గ్రుచ్చిన పూలు.'[15] అందుకే 'నిన్నటి గురించి నిరాశ, నేటి గురించి అసంతృప్తి, రేపటి గురించి అందమైన కలలు బొమ్మలు'[16] ప్రతీవాడికీ. కాబట్టి భవిష్యత్తుపై గల ఆశతో వర్తమానంలోని నిరాశను మనిషి జయిస్తాడు. వత్తి కాలితేనే వెలుగు. సమస్య ఉంటేనే పరిష్కార మార్గం. అలాగే మనిషి మనసులో అశాంతి అలముకున్నప్పుడే శాంతికి వెలుగు బాటలు వేస్తాడు అతడు. అనాదిగా సాగిన చరిత్రంతా అశాంతిలో రూపొందిందే! అందుకే అశాంతి 'జీవితం కళాకృతిగా మారడానికి నాంది' అనీ, అందలి 'వీరకృత్య చిహ్నాలు చరిత్రలోని ప్రగతి సోపానాల'[17]నీ అంటారు.

ఆశ తీరితే మనిషికి ఆనందం. లేదా నిరాశ కలిగితే 'జీవితానంతర భావనలో పుణ్యలోకాలు' సృజించుకుంటాడు. కాబట్టి మనిషి 'సుఖదుఃఖాత్మక జీవితం' ప్రతిబింబిచేది 'కాలం'. జనన మరణాల బిందువులను 'ఈ లోకంతో కలిపే దివ్యరేఖ ఈశ్వరుడు!' ఈ మూడింటికి సంబంధం విశదీయ రానిదైనా ఒక తరం నుంచి మరో తరానికి, ఒక యుగం నుంచి మరో యుగానికి, 'సృష్టిరహస్య

గవేషణ' కొనసాగుతూనే ఉంది. ఈ నిరంతరాన్వేణలో గడించిన 'అనుభవం నుండి ఆలోచన-ఆలోచన నుండి అనుభూతి, అనుభూతి నుండి వివిధ కృతులూ, ఆకృతులు. ఫలితంగా భిన్నమతాలూ, జాతులూ, వ్యవస్థలు ఎవరికి వారే తమ చుట్టూ ప్రత్యేక వలయాలు ఏర్పరచుకొని, తమవే 'విశిష్ట సంస్కృతీ నిలయాలుగా' భావించుకొని ఘర్షణలకు, సంఘర్షణలకూ గురి అవుతున్నారు.

ఈ విపత్కర పరిస్థితి నుంచి బయటపడి, సృష్టిరహస్యాల ముడులను విప్పాలంటే ఆత్మజ్ఞాన వంతుడై మనిషి 'తనలో తాను మేల్కొనాలి.' వైయక్తిక వికాసంతో 'విశ్వ సంస్కృతీ రూపం 'ఎత్తాలి. 'స్థూల ప్రకృతి నుండి సూక్ష్మ స్వభావం వరకు – వైయక్తిక వలయం నుండి విశ్వాత్మలోకి'[18] పయనం సాగించాలి. 'లోలోని గాలి శబ్దమై,' ప్రణవమై ఆత్మానందానుభూతిని అందించాలి. అప్పుడు మనకూ – కాలానికీ భేదం నశిస్తుంది. దేశమూ మనమూ ఒకే రూపంగా అవతరిస్తాం. అందుకే 'కణ కణంలో జాతీయభావం వెలగనీ స్పృశిస్తూ ఆత్మరూపం'[19] అని ప్రబోధిస్తాడు కవి.

అయితే ఇది మాటలతో జరిగేది కాదు. ఎదలో స్పందన, మదిలో మానవత, ఆలోచనలో ఆత్మీయత కావాలి. అది యోగసాధన ద్వారా సమకూరుతాయి. అదే 'అతీత మానసిక శక్తి' అంటారు అరవిందులు. ఈ విషయం 'ఆనందధుని', కావ్యంలో చర్చించారు మాదిరాజు వారు. మనిషి 'అనేక రస ప్రవాహాల ఆనంద నృత్యానికి అవనీ చక్రం' గా నిలుస్తాడు ఆ శక్తితో. అదే 'వసుధైక కుటుంబం' ఏర్పడగల స్థితి. దానికి మనిషికి కొంత సాధన కావాలి, పరిణత, పరిణామం రావాలి. అందుకే

'మాటలో ఊహలు పాడనీ
చూపులో మాటలు వెలగనీ
శబ్దశక్తులకు ప్రతీకగా
నడువు దిక్కుల్లోకి
కలువు స్వేచ్ఛగా'[20] అని ప్రబోధిస్తాడు కవి.

ఆ తరుణంలో ప్రపంచ పటంలో సరిహద్దు రేఖలు చెరిగిపోతాయి. పరస్పర సహకారంతో, విజ్ఞానానికీ, సంస్కృతికీ ప్రతిబింబాలుగా మానవులు శాంతితో ఉంటారు. అదే 'విశ్వైక్య మానవత' మాదిరాజువారి దృష్టిలో!

"మానవునిలో మానవత చివురెత్తినపుడు
ఎవరైతేనేం? ఏ దేశమైతేనేం?
అంతా ఒకే ఆకృతిలో చైతన్య శిఖలు."

1. యుగసంకేతం – (పుట 25), 2. వెలుగులో ఈ నేలపై – (పు. 8.), 3. యు. సం. – (పు. 1.), 4. మేల్కొన్న ఈ సమయం – (పు. 2.), 5. మానవీయం – (పు. 17 – 18), 6. శబ్దమై. ప్రాణమై – (పు. 2.), 7. యు. సం – (పు 21.), 8. పడగెత్తిన ఉదయం – (పు. 46.), 9. ఆవాహన – (పు. 19.), 10. ముక్తధాత్రి – (పు. 16.), 11 వయొలిన్‌పై రాగంతో – (పు. 21.), 12. యు. సం – (పు. 55.), 13. అవా – (పు. 2.), 14. ప–ఉ (పు. 11.), 15. ముక్తకాలు II – (పు. 57.), 16. మాన – (పు. 33.), 17. మాన – (పు. 31.), 18. మాన (పు. 5.), 19. మె ఈ. – (పు 40.), 20. మె ఈ. – (పు. 53.)

# గిరిజన భాషాధ్యయనం - కోయ భాష

డాక్టర్ వి. స్వరాజ్యలక్ష్మి

గిరిజనులు ప్రపంచం మొత్తంమీద ఆఫ్రికా తరువాత మన దేశంలోనే అధిక సంఖ్యలో ఉన్నారు. అనేకమంది సామాజిక, భాషా శాస్త్రజ్ఞులు వీరి గురించి, వీరి భాషా సంస్కృతులను గురించి ఆసక్తి కనబరిచి పరిశోధన చేశారు. ఈ పరిశోధన గ్రంథాలు ఆధారంగా దేశంలో ఎన్ని గిరిజన జాతులున్నాయి, ఎన్ని గిరిజన భాషలున్నాయన్న విషయం తెలుస్తున్నది. గిరిజన భాషయైన "కోయ" గురించి ఇదివరకు కొంత పరిశోధన జరిగింది. ఈ భాష మాట్లాడే వాళ్లు ఆంధ్రప్రదేశ్‌లో ఖమ్మం, వరంగల్, కరీంనగర్, ఆదిలాబాద్, పశ్చిమ గోదావరి జిల్లా ఏజెన్సీ ప్రాంతాల్లో ఉన్నట్టు తెలుస్తున్నది. ఈ భాష మాటాడే వారి సంఖ్య 1,36,644 ఉండవచ్చునని జనాభా లెక్కల ప్రకారం తెలుస్తున్నది. ఖమ్మం జిల్లాలో మాట్లాడే కోయ మాండలికాన్ని గురించి శ్రీ సుబ్రహ్మణ్యం గారు (1965) పరిశోధించి, ఆ భాషా విశేషాలను పుస్తకరూపంలో ప్రచురించారు. పశ్చిమ గోదావరి జిల్లా ఏజెన్సీ ప్రాంతాల్లో నేనూ, నా సహోద్యోగిని కుమారి ఉషా పన్నాల పర్యటించి అక్కడి వారి భాషని సంస్కృతిని పరిశీలించిన తరవాత కొన్ని విశేషాలు తెలిశాయి.

కోయభాష, మధ్య ద్రవిడభాషలలో ఒకటి అయిన గోండిభాష మాండలికమని శ్రీ పి. యస్. సుబ్రహ్మణ్యంగారు (1968) లో చెప్పారు. కానీ ప్రాథమిక పదజాలంలోనూ (అనగా సంఖ్యా వాచకాలు, బంధుత్వ బోధక శబ్దాలు) వ్యాకరణంలోను ఈ రెండింటి మధ్య కొన్ని భేదాలు కనిపిస్తున్నాయి. ఈ రెండు మాట్లాడే వారి మధ్య పరస్పర అవగాహన కూడ చాలా తక్కువని వారే పేర్కొన్నారు. అందుకని గోండి, కోయ వేరువేరు భాషలా, ఒకే భాష మాండలీకాలా అన్నది పరిశోధన చేయాల్సి ఉన్నది. కోయభాషలోనే ప్రాంతీయ భేదాలు కూడా కనపడుతున్నాయి. తెలుగులో అడిగిన ఒక మాటకి భిన్న గ్రామాలలో ఉన్న కోయ వారు తమ భాషలోనే భిన్నశబ్దాలను పర్యాయపదాలుగా ఇవ్వటం జరిగింది.

| కోయ | | |
|---|---|---|
| ముతపాలు | అశ్వారావు పేట | భర్త (తెలుగు) |
| మిండాలు | పులిరాముడు గూడెం | |

ఈ గిరిజనులలో కులభేదాలు లేవు. విద్యావంతులై, ఉద్యోగాలు చేస్తున్న గిరిజనులలో మాత్రం ఇంగ్లీషు, తెలుగు పదాల వాడుక ఎక్కువగా ఉన్నది.

గిరిజనులని ప్రోత్సహించే నిమిత్తం తలపెట్టిన కార్యక్రమాల మూలంగ వారు తమ భాషని, సంస్కృతిని కొంత మరచిపోయే అవకాశం కనిపించినప్పటికీ తమ భాషకి ఒక లిపి ఉండాలని, తాము తమ భాషలో రాయగలగాలనీ, వ్యక్తపరిచారు. పశ్చిమ గోదావరి జిల్లాలో ఉన్న కోయలకి తెలుగు వారితో ఎక్కువ

సన్నిహిత సంబంధం ఉండటం వల్లనూ, ప్రభుత్వం తలపెట్టిన కార్యక్రమాలను నిర్వహించే వారందరూ తెలుగువారే కావటంవల్లనూ కోయ భాషలో తెలుగు పదాలు ఎక్కువగానే వాడుకలోకి వచ్చాయి. ముఖ్యంగా విద్యావిషయక రంగాల్లో, ఆధునిక గృహ పరికరాల విషయంలో, వ్యాపార వాణిజ్యరంగంలో తెలుగు పదాలు తప్ప కోయ పదాలు లేనే లేవు. ఉదా: బడి, పంతులమ్మ, పాఠం, తరగతి, గంట, సంత మొ॥వి. ఎందుకంటే విద్యావిషయాలకి దూరంగా ఉంటూ, అడివిలో ఉన్న కలప కొట్టుకుంటూ, తాటికల్లు సేవిస్తూ కాలం గడిపే కోయవాళ్లని తీసుకొచ్చి విద్యావంతులుగా చేయటానికి పూనుకొన్న ప్రభుత్వం వారి పిల్లలకి తగిన వసతులు కల్పించి తెలుగుభాష ద్వారా విద్యాబోధన మొదలు పెట్టింది. అదే విధంగా గృహ వసతులని గురించి గూడ ప్రత్యేకంగా వారికి నేర్పించటం మూలంగా, అంతకు ముందు వారికి ఆ విషయం గురించి ప్రత్యేకంగా తెలియకపోవటం వలన తెలుగు పదాలే వాడుతున్నారు. ప్రాథమిక పదజాలం మాత్రం కోయ భాషలోనే ఉంటుంది. ఉదా : ఏరు (నీళ్లు), దోడ (అన్నం), కటూల్ (మంచం), కిస్సు (నిప్పు), లోను (ఇల్లు), పోడు (వ్యవసాయం) మొ॥ వి.

పైన చెప్పిన విషయాలను చూసి వారికి సాహిత్యం కాని, భాష కాని లేదనుకోవటం పొరపాటు. అవసరం కొద్దీ వారు మన లాగానే ఇతర భాష పదాలనివాడి నప్పటికీ, వారి భాషలో కూడ చక్కటి జానపద సాహిత్యం, కథలు, పొడుపు కథలు ఉన్నాయి. భాషా పరంగా అధ్యయనం చేయడానికి కూడ అవి ఆసక్తికరంగా ఉంటాయి. ఇతర ద్రావిడభాషల్లో లాగానే ఈ భాషలో కూడ రెండు వచనా లున్నాయి. ఏకవచనం, బహువచనం:– జెరు, –స్కు, –కు బహు వచన ప్రత్యయాలు.

| ఏకవచనం | బహువచనం | తెలుగు |
|---|---|---|
| మామాలు | మామలోరు | మామగార్లు |
| పోయే | పోయేస్కు | అత్తగార్లు |
| గొడ్డు | గొడుకు్క | ఆవులు |

క్రియా పదంతాల్లోని లింగభేదం పరిశీలించినట్లయితే, తెలుగులో లాగ కాకుండ ఇతర మధ్య ద్రవిడ భాషలలో లాగా (గోండి, కొండ, కుయి, కువి) ఏక, బహు వచనాల్లో మహత్, అమహత్ భేదాలే కనబడతాయి.

ఓండు వాతోండు(మహత్ ఏకవచనం) వాడు వస్తాడు.

అద్దువాతి (అమహత్ ఏకవచనం) అది/ ఆమె వస్తుంది.

ఓరు వాసిందోరు (మహత్ బహువచనం) వాళ్లు వస్తున్నారు.

అవు వాసిందాకు (అమహత్ బహువచనం) వాళ్లురు్న. / అవి నావస్తు

క్రియా పదాలని చూసినట్లయితే తద్ధర్మార్థక క్రియలకి, భూతకాల క్రియలకి ప్రత్యయాలలో భేదం కనబడుతుంది. శత్రర్థక క్రియా రూపాలు కూడ ఉన్నాయి. సర్వనామాలు, విశేషణాలు, క్రియా విశేషణాలు ఈ భాషలో కనపడ్తాయి. కానీ ఒరోటి (ఒకటి) అన్నపదం తప్పించి ఇప్పటి కోయ భాషలో వేరే సంఖ్యా పదాలు ఆ భాషవి లేవు. ఇప్పుడు వాళ్లు వాడుకుంటున్న సంఖ్యావాచక పదాలన్నీ

తెలుగువే. అందుకు సాంస్కృతిక సంబంధాలే కొంతవరకు కారణం కావచ్చును. వారు పూర్వం గడిపిన జీవితంలో ఒకటికి మించిన వస్తువులని లెక్కించే అవసరం లేకపోయి ఉండవచ్చును. లేదా ఎరువు మాటలు సొంత మాటలను కాలక్రమాన తొలగించి ఉండవచ్చు. ఇప్పుడు వారికి వ్యాపార దృష్టి ఏర్పడి సంతలలో బేరాలు చేయటం నేర్చుకున్నాక తెలుగు సంఖ్యలనే వాడటం మొదలుపెట్టి ఉండ వచ్చును. ఈ విధంగా పరిసర నాగరక జాతులతో కలసిపోవాలనే ఉద్దేశ్యంతో వారు తమ భాషని, సంస్కృతిని విస్మృతపరచు కొంటూ అభ్యున్నతి మార్గాన పయనిస్తున్నారు.

పైన చెప్పిన విధంగా మిగిలిన జాతులతో మిళితం అయినంత మాత్రాన గిరిజనులకి తమ భాష పట్లగానీ, సంస్కృతి పట్ల గానీ చిన్న చూపు ఉందని భావించి బలవంతంగా మరో భాషను బోధించే కంటె వారి భాషకే లిపి ఏర్పరచి వాచకాలు తయారుచేసే బాధ్యత కూడ ప్రభుత్వానికుంది. ఈ రకంగా చేయటం మూలంగా ఇంకా ఎక్కువ మంది పాఠశాలకు వచ్చి చదువు నేర్చుకుంటారు. ఎందుకంటే 3 సంవత్సరాల పిల్లలకి మొదటిసారిగా చదువు నేర్పించాలన్నప్పుడు తప్పనిసరిగా ఆ ఉపాధ్యాయుడు కోయభాష నేర్చుకొని వాళ్లకి అర్థం అయ్యే విధంగా పాఠాలని నేర్పించాల్సి వస్తుంది. స్వభాషలోనే వాచకాలు తయారు చేసి ఇస్తే, గిరిజన బాలలకి చదువు ఎంతో సులభంగా ఉంటుంది. వారి భాషకు తెలుగు లిపినిస్తే భవిష్యత్తులో తెలుగు నేర్చుకోవటం వారికి సులభమవుతుంది. అంతేకాక వారి భాషకి సమాజంలో ఒక స్థానం కల్పించి నట్లవుతుంది. అదే ఉద్దేశ్యంతో తెలుగు అకాడమి ఈ గిరిజన భాషాధ్యయనం చేపట్టింది.


ఉపయుక్త గ్రంథాలు

1. Andronov M. S - Dravidian Languages, Moscow 1970
2. Subrahmanyam P. S - A Descriptive Grammar of Gondi, Annamalai university, Annamalai Nagar, India, 1968.


## సవిత . . . . . . . . . . . . . పులిచేరి రామమోహనరావు

ఇమేజరీ గారడీలతో
డొంక తిరుగుడుగా చెప్పటం కవిత్వమై
నిజాన్ని సూటిగా చెప్పటం నినాదమైతే
నినాదాన్నే వరిస్తాను
నిజాన్నే వర్షిస్తాను!
అది కవిత కాకపోతే మానె
సవిత అయితే అంతే చాలు నాకు.

భావాన్ని అయోమయపు కేజ్‌లో పెట్టి
పాఠకుణ్ణి వెతుక్కోమనటం కన్నా
సూటిగా నిజం చెప్పి
రేపటి లోనికి చూడగల్గిన
చూపును ప్రసాదిస్తాను
ఈనాటి చీకటిని దాటించే
సెర్చిలైటునై ప్రకాశిస్తాను

# పాత కథకి కొత్త ముగింపు

**కథానిక**

జి. నరసింహమూర్తి

ఆ యిల్లు యిల్లు కాదు. పిల్లల యంత్రాంగం. నష్టాల్లో కష్టాల్లో, అప్పుల్లో, అవస్థల్లో తప్పని సరిగా నడుస్తున్న పిల్లల్ని తయారు చేసే ఫ్యాక్టరీ!

అందులో ముగ్గురన్నదమ్ములు. పెళ్ళిళ్లయ్యాయి కాబట్టి పెళ్ళాలొచ్చారు. తర్వాత షరా మామూలే !

మొదట అతని పేరు అందరికీ తెలిసిందే! సుబ్బారావును అంతా బార్బర్ సుబ్బారావంటారు.

ఏ పనిలోనూ రాణించక కడకి ఈ పని ప్రారంభించి అలాగే బతుకును గెంటుకొస్తున్నాడు.

బయోగ్రఫీ ప్రకారం కేసు స్టడీ చేస్తే చదువు వానాకాలంది. జీవితంలో అనుభవం నలభై వరకూ చేరింది. ఏడో సంతానం ఎమర్జన్సీ తర్వాత పుట్టాడు కనుక దాన్నో స్థిరాస్థి కిందకే జమేసుకొన్నాడు సుబ్బారావు. అతని భార్య అందులో హక్కును చచ్చినా పోనిచ్చుకోనంది. కనేటప్పుడు ప్రాణంమీదకొచ్చినా కన్న తర్వాత ఆ రైట్ చచ్చినా వదులుకోని సెకండ్ సెక్స్ మరి! పైగా భారత దేశంలో మాతయిన స్త్రీమూర్తి.

రెండోవాడు వెంకటరత్నం.

ఊళ్లో పెద్ద మనుషులన్న వాళ్ళతో కలిసి తానూ అందులో ఒకణ్ణనే అనుకుంటూ వాళ్ల తోక పట్టుకు తిరుగుతుంటాడు. సంత పాడుకున్న వెంకటశెట్టి తరఫున ఆదివారం సంతలో పన్నులు వసూలు చేస్తుంటాడు. పల్లెవాళ్ళ దగ్గరా, కూరగాయల వాళ్ళ దగ్గరా, లోకువగా దొరికిన మాంసం దుకాణాల కాడా గదమాయించుకొని కాస్తో కూస్తో వేయించుకుంటాడు. చెరువు పాటల్లోనూ, కోడిపందాల్లోనూ ప్లేట్లు ఫిరాయిస్తాడు. మొత్తం మీద సాయింత్రానికల్లా కన్నమందకి ఏదో తెచ్చి పారేస్తాడేదో రూపాన. ఆదాయం పెంచుకోవాలని అడ్డమైన గడ్డీ తింటూ తిరుగుతుంటాడు.

అయిదో కాన్పుకి గవర్నమెంటు ఆస్పత్రిలో పెళ్ళానికి ఆపరేషన్ చేస్తే గాని తల్లీ బిడ్డ దక్కలేదు.

అప్పుడే చెప్పాడు డాక్టరు, శుభ్రంగా ఇద్దరిలో ఎవరో ఒకరు ఆపరేషన్ చేయించుకుంటే తర్వాత ప్రమాద ముండదని.

అయినా అదే ప్రమాదం మళ్లీ సవంత్సరానికి పెళ్ళాం మీదకి నెట్టేసి గవర్నమెంటు ఆస్పత్రిలో ఆమెను పడేసి, పొతే అదే పోతుందన్న ధీమాతో హాయిగా యింటికి తిరిగి వచ్చాడు.

పెళ్ళానికి పొట్ట చీల్చయినా బిడ్డను తీయడానికి ఒప్పుకున్నాడుగాని ఆవిడకి పిల్లలు పుట్టకుండా ఆపరేషన్ చేయించాడా అంటే లేదు. అప్పణ్ణుంచీ ఆమె తీసుకుంటూ, లాక్కుంటూ. బతకలేకా చావలేకా పడుంది.

మూడోవాడు వెంకటేశ్వరులు.

కాలం ఖర్మం కాలిసొచ్చి ఆర్మీలో చేరాడు. ఆర్డరరీలో బండ తేరిపోయాడు. సెలవుమీద తిరిగొచ్చి చిల్లర తిరుగుళ్ళు ప్రారంభించడంతో రెండో సంవత్సరం లోనే ఓ అమ్మాయిని వెదికి మెడకి కట్టేసింది తల్లి.

పెళ్ళాన్ని ఫార్వర్డ్ ఏరియాలకి తీసుకెళ్ళడం వీలుకాదు కనుక ఇంటి దగ్గరే వదిలేశాడు గాని ప్రతీ సంవత్సరమూ సెలవులో వచ్చి ఓ బిడ్డను భార్య కడుపులో పోసి పోతాడు.

అతగాడు పిల్లల్నీ పెళ్ళాన్నీ మరచి పోయి అక్కడిచ్చే లిక్కరు తాగి కక్కా ముక్కా తిని మజా చేస్తాడు.

ఇంటి దగ్గర పెళ్ళాం కూలీ పనులు చేసుకుంటూ పిల్లల్ని పెంచుకుంటోంది.

అసలు బతికున్నవాళ్ళు ఈ ముగ్గురే కాని టీబీ వచ్చి ఓ కొడుకు పోయాడు. నోట్లో పుండేసి మందూ మాకూ లేక ఓ కొడుకు పోయాడు. గనీ సాహెబ్ కొట్లో దొంగతనం చేస్తుండగా కొట్టి చంపబడ్డ కొడుకు చరిత్ర అలాగే సమాధి అయిపోయింది.

ఇంత మందిని కన్నా తల్లీ తండ్రీ అంతటితో ఆగలేదు. దేవుడిస్తున్నాడు కదానని ఓ కూతుర్ని కూడా కనేశారు.

ఆ కొంపలో జరుగు తున్న కథకి మెలికి అదే!

తండ్రి చనిపోయినా ముసలి తల్లి మాత్రం కొద్దో గొప్పో కంట్రోలరుగా వ్యవహరిస్తూ నే ఉంటోంది కొంపలో.

కూతురికి మంచి మొగుడయినా దొరుకుతాడేమోనని ముసలావిడ బడికి పంపిన మాట నిజం. →

## హరివిల్లు

### చామర్తి దుర్గాప్రసాద్

వెన్నలో దించిన కత్తిలా
సన్నగా, సుతి మెత్తగా, నున్నగా
ఉలి కోతలతో గంధపు చెక్క
అంగాంగాలూ అమర్చుకొని,
ఎంత అపురూపంగా తయారయింది!

ఎంత పనివాడితనం!
ఎన్ని సంవత్సరాలో సూదితో కుట్టిన,
చీకటి తివాసీ మీద నక్షత్రాల పూలు
నీ ముందు పరిచారు
ఎంత అందంగా తయారయింది!

అతగాడి మీద చెమ్కీలు కప్పి
గంటల తరబడి రంగులు మర్దించి
ఆ తరువాత మరెన్నో గంటలు
ఎద్దు బండి మీద నిల్చోబెట్టారు.

ఆటుపోటుల సముద్రంలో
చెక్కు చెదరని నావలా
అతగాడు అమ్మవారి కొలువులో
దేవతలా ఎంత నేత్ర పర్వంగా
తయారయ్యాడు!

అపురూపమైన - కళాఖండం, సగటు
మనిషి ఎంత అద్వితీయ కళాకేళి -
ప్రజాస్వామ్యం!
ఎన్ని గొర్రెలు పరచిన జీవితం తివాసీ!

నెమల్ని నరికి,
ఆకాశంలో అంటించారు పింఛం.
ఎంతఅందంగా అమిరింది "హరివిల్లు"!
ఏదీ సవ్యసాచి?
ఎక్కుపెట్టడేం హరివిల్లు?

కూతురు రాజమ్మని గాలి పాటుకి బడికి పంపినా చదువులో అందర్లోనూ ముందుండేది.

ఆ కొంపలో ఇంత తెలివైన పిల్ల ఎలా కలిగిందానని పంతుళ్ళు తల కింద లయ్యేరు.

చెల్లెలు చదువుకి ఏ అన్నా ప్రోత్స హించిన పాపాన పోలేదు. పైగా చదువంటూ డబ్బు ఖర్చు చేస్తుందని ఒకటే మూలుగుడు ప్రారంభమైంది యింట్లో.

'దీణ్ణెవడికో ముడెట్టక చదువెందుకే అమ్మా!' అంటూ రాగం ప్రారంభించారు అన్నలు.

'కాదులే అత్తా! - నీ కూతుర్ని కలక్టేరు చెయ్యి – అప్పుడు నీ నెత్తినా మా పిల్లల నెత్తినా ఇంత రాడెట్టుద్ది' అంటూ వాళ్ల పెళ్ళాలు తాళం.

రాజమ్మ చదువు ఆగిపోయింది.

ఇంట్లో పిల్లలకి చాకిరీచేయడంతోనే సరిపోతుంది ఇక.

కాని ఎంత కాలం?

రాజమ్మకు వయసొస్తోంది.

లోకం కూడా తెలిసొస్తోంది.

ప్రతి అన్నా గంపెడు పిల్లల్ని కన్నాడు.

తన బాగేదో తాను చూసుకుంటు న్నాడు.

ఎదిగిన చెల్లెలుందన్న మాట అక్క ర్లేదు.

తమమీదే ఆధారపడి ఓ అమాయక జీవి బతుకుతుందన్న బాధ లేదు.

ఎందుకు వీళ్లకీ స్వార్థం?

పోనీ వీళ్ళకయినా సుఖముందా?

కుటుంబ నియంత్రణ వచ్చింది. గుడ్డిగా బతుకుతున్న దంపతుల్లో ఒక పరివర్తన తెచ్చింది. దాని మంచితనం ప్రజలకు అర్థమయింది. కాని తన అన్న లకు మాత్రం అదేమీ అవసరం లేకుండా పోయింది. ఎంత మూర్ఖత్వం?

ఇల్లు పిల్లల సంత. సుఖం లేదు. శాంతి లేదు. తిండి లేదు. బట్ట లేదు. ఎవరి గొడవ వాళ్లది.

వెనక పెద్దమనిషయ్యి పది సంవత్స రాల నుంచి అలాగే తమతో దిక్కూ తెన్నూ లేకుండా పడున్న తోబుట్టువుం దన్న జ్ఞానం ఏ ఒక్కడికి కలుగలేదు.

ముసలి తల్లి 'చెల్లెలు బతు కిలాగే నట్రా బాబూ' అని కొడుకుల దగ్గర కదలేస్తే-

'ఎక్కడన్నా దాచి పెట్టావేమో, తెచ్చి చెయ్యి' అంటూ కస్సుమంటాడు.

రాజమ్మ ఓర్చుకోలేక పోతోంది ఇవన్నీ. కన్న కలలన్నీ బుగ్గిపాలవు తున్నాయి. సజీవంగా కాలుతున్నా నోరువిప్ప లేదు. మనస్సు విప్పిచెప్పు కోలేదు.

అయినవాళ్ళున్నారు. రక్తాన్నిపంచు కొని పుట్టిన వాళ్ళున్నారు. కాని, తనకూ కోరికలున్నాయన్నది వాళ్లకు తెలి యదా?

తమ సంసారాలూ!

తమ సంతానాలూ!

తమ సంపాదనలూ!

మగాడి వంక కన్నెత్తి చూస్తే కారాలూ మిరియాలూ నూరుతారు అన్నలు. సగం చచ్చి నాకిది కావాలని అడిగితే కళ్ళెర్ర జేస్తారు.

కట్టుకున్న చీరకు మాసికలేసుకో లేక రాజమ్మ విసిగిపోయింది.

ఎంత కాలం అడుగుతుంది వాళ్లని. ఆ మాత్రం బుద్ధీ జ్ఞానమూ లేకుండా పోయాయి నాలికి

పోనీ తన బ్రతుకు అలాగే కాలి పోయినా పర్వా లేదు. వాళ్ళకైనా బుద్ధొచ్చి కుటుంబాల్ని పరిమితం చేసు కుంటారేమో నంటే అదీ లేదు.

కుటుంబ నియంత్రణ సిబ్బంది చాలా సార్లు వచ్చింది. వీళ్ళకి నచ్చ జెప్ప లేక తిరిగి వెళ్ళింది కూడా.

ఆర్మీ ఉద్యోగం నచ్చక వెంకటే శ్వర్లు మూటాముల్లె సర్దుకొని అమాం తంగా కొంప చేరాడు పెద్ద ఉద్ధరించే సే వాడిలా.

మళ్లీ తనకో పాత చీర దొరుకు తుందని మంత్రసాని మురిసిపోయింది.

రాజమ్మ చిరిగిపోయిన బట్టల్తో అన్నల ముందే మసలడానికి సిగ్గుపడు తోంది.

ఆ ఒళ్ళు దాచుకోడానికీ, కాలే కడు పుకి కాస్తంత ముద్ద సంపాదించడానికీ నీతికంటే అవినీతే ఎక్కువ తోడ్పడు తుందన్న సత్యం ఆమెలో మొలకెత్తింది. కాని దానినెలా త్రుంచి వేయాలా నని రాజమ్మ చాలాసార్లు ప్రయత్నించింది.

"మీ ముగ్గురన్నదమ్ములూ ఇకనైనా ఆపరేషన్ చేయించుకోండి. అటు మీకూ క్షేమమే - ఇటు పిల్లలకూ క్షేమమే -"

ఆ వూరికి కొత్తగా వచ్చిన ఫామిలీ ప్లానింగ్ వర్కర్ అన్నాడు ఆ కొంపలో వారందర్నీ ఉద్దేశించి.

మగవాళ్ళు పెడముఖం పెట్టారు.

"అంతే కాదు. ఆపరేషన్ చేయించు కుంటే ఆడవాళ్ళకయినా, మగవాళ్ళ కయినా డబ్బిస్తాం" - ఇంకో ఆయన.

"అయితే నేను చేయించుకుంటా నండి" రాజమ్మ దివిటీలా ముందు కురికింది.

"పిల్లలెంత మందమ్మా?"

"నాకింకా పెళ్ళి కాలేదు."

"పెళ్లి కాకుండానే?!"

"అవును. ఆ అదృష్టం కలుగుతుం దనే ఆశలేదు"

"అందుకని?"

"నేనో ఇంటి కోడలి నవుదామను కున్న కలలు కలలుగానే ఉండి పోయాయి గనుక. ఇకనైనా బతుకు తెరువు వెదుక్కో డానికి నాకింత కంటే మరో మార్గం వేరే కనిపించ లేదు గనుక."

రాజమ్మ మాటలు తనకయిన వాళ్ళ గుండెల్లోంచి తూటాల్లా దూసుకు పోయాయి.

## తాగినోడిలా - గాడ్పు

### కొల్లూరి సూర్యనారాయణమూర్తి

నిశ్శబ్ధంలో శబ్దం చేస్తూ
తాగినోడిలా గాడ్పు
తందనాలు తొక్కుతుంది
తారు రోడ్డు నిండా

చింత నిప్పుల లాంటి ఆ కళ్ళను చూసి
ఎండుటాకులు ఏడుస్తున్నాయి

ఏట్లో నీరు తాగేసే వాడెవడని
కప్పలు అరుస్తున్నాయి

వాడిన పూలన్నీ
వాడెవడని తిడుతున్నాయి

ఎండు గొంతుక పిచ్చిదానిలా
బొమ్మని గొంతు చించుకుంటోంది!

# పంచ ప్రాణాలు

బెజవాడలో మారిన బండి తెల్లవారు తోందనగా కొండపల్లి దాటింది. అది మొదలు "పరాయిదేశాలు వెడుతున్నా" మన్నట్టుంది నాకు.

ఇప్పటికిన్నీ, తూర్పు గోదావరి జిల్లాలో పుట్టి పెరిగిన వాడికి, మొదటి మాటు, తుని దాటితే మరో ప్రపంచమూ, ఒంగోలు దాటితే మరో ప్రపంచమూ, నరసారావు పేట దాటితే మరో ప్రపంచమూ, కొండ పల్లి దాటితే మరో ప్రపంచమున్నూ.

అసలు ఏలూరు దాటితేనే భేదం కన పడుతూంది. అది అవగాహన కానిది కాదు.

అక్కడిదీ, అక్కడిదీ, అక్కడిదీ, అక్కడిదీ కూడా కండగల తెలుగే; గాని కాదేమో అనిపిస్తుం దెక్కడి కక్కడే.

అందుకు బెదరక, మళ్ళీమళ్ళీ వెళ్ళాడా, తెనుగు భాష తన విశ్వరూపం కన పరుస్తుంది. ఆంధ్రత్వమున్నూ సమగ్రం అవుతుంది, వెళ్ళిన వాడికి.

ఒక్కొక్క సీమలో వొక్కొక్క జీవ కణం వుంది తెనుగు రక్తంలో. అన్నీ వొకచోటికి చేర్చగల – అన్నీ వొక్క తెనుగు వాడి రక్తంలో నిక్షేపించగల మొనగాడు పుట్టుక రావాలి, అంతే.

మొదటి మాటు విశాఖపట్నం వెళ్ళా న్నేను. అప్పటికి నాకున్నది వొక్కటే ప్రాణం.

వారం రోజులున్నా నా మొదటి మాటడక్కడ.

రెండో ప్రాణం సంక్రమించినట్టని పించింది, దాంతో నాకు.

తరువాత నెల్లూరు వెళ్ళాను. మూడో

## అభిలాష

### చాగంటి రామారావు

తూర్పుకి పడమరకి
వంతెనొకటి నే వేస్తా
వంతెనపై సూర్యుణ్ని
దొర్లించుకు నే వెళతా !!
ఆకాశపు సముద్రంలో
తేలే నక్షత్రాల రాళ్ళమీద
దుముకుతూ గంతులేస్తా
చవితి చందమామ దెచ్చి
పడవ చేసి వదిలేస్తా !!
బరువెక్కిన కాలపు పందిరికి
వేళ్ళాడే ద్రాక్షగుత్తులు క్షణాలు
పుచ్చినవి, చచ్చినవి
ఎండినవి, క్రుళ్ళినవి ఏరి నేను పారేస్తా
పన్నానిస్తే మాధుర్యం చిందించే
పళ్ళెన్నో కాయిస్తా
నా తోటలోకి షికారుకై
రారండని కేకేస్తా ;!
రంగులు నింపు కొన్న పూల గిన్నెలో
ఊహల కుంచెలు ముంచి
మీ గుండెల కాన్వాసులపై
కవితల బొమ్మలు రాస్తా
విస్ఫులింగ విలయాగ్నిని
గడగడమని త్రాగిస్తా
గుండెపిండి మానవతని
కన్నుల్లో నింపేస్తా !

ప్రాణం సంక్రమించి నట్టనిపించింది.

చివరికి హనుమకొండ వెళ్ళాను, అయిదో ప్రాణం కూడా నాకు సంక్రమించినట్టు – నా ఆంధ్ర రక్తం పరిపూర్ణమయినట్టనుభూతం అయింది నాకు.

ఇవాళ చూసుకుంటే అయిదు ప్రాణాల నిండుజీవితమే నాది. అందుకు తగ్గ దార్ఢ్యం మాత్రం కూడలేదనే చెప్పాలింకా.

అందుకోసం నేను చేసుకున్న దోహదం బహు తక్కువ మరి.

ఆంధ్ర హృదయం - ఆంధ్ర భాష పరంగా వ్యక్తం అవుతున్న జీవన సరణి నాకింకా బాగా అవగాహన కాలేదు.

నా స్వప్రాంతపు పలుకుబడిలో యెంత జీవ శక్తి వుందో, అక్కడక్కడి పలుకుబళ్లలోనూ, అంతంత జీవశక్తి వుంది, వారాల్లోనూ మాసాల్లోనూ పట్టుబడేది కాదది.

ఒక్కొక్క చోట ప్రచలితం అయే కాకువూ, వొక్కొక్క చోట ప్రయుక్తం అయే యాసా పుస్తకాలు చదివితే అందవు. వొక చోట కూచున్నా దొరకవు – పల్లెలూ పట్నాలూ తిరగాలి, అష్టాదశ వర్ణాల వారిలోనూ పరభాషా వ్యామోహం లేని వారిని కలుసుకోవాలి, ఆ పలుకుబళ్లు చెవులారా వినాలి. ఆ ప్రయోగ వైచిత్రి సవిమర్శంగా పట్టుకోవాలి, ఆ నాదం – చిక్కని ఆ మధుర నాదం అవగాహన చేసుకోవాలి. అన్నిటికీ ప్రధానంగా "ఇది నా సొంత భాష – మొదటి మాటు నా తల్లి నా జీవశక్తికి జత చేసిన నాకు వాగ్ధార ఆవిర్భవింప చేసిన సంజీవిని అన్న ఆత్మీయతా, మమతా ఉద్బుద్ధాలు చేసుకోవాలి, ముందు.

అప్పుడుగాని యే తెనుగువాడికీ నిండు ప్రాణం వుందని చెప్పడానికి వీల్లేదు. దాని కోసం నా పరితాపం యిప్పటికీ.

[శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి 'అనుభవాలు జ్ఞాపకాలూను' నుండి]

# లోకాలోడనం

## రంగినేని సుబ్రహ్మణ్యం

నా హృదయంలో వీచే దుమారం
నానా విధ భావాన్వయ సమరం !!
లోకాలోడన
యజ్ఞ గుండమున
నాకగుపించెను గాజు శకలములు.

విరిగిన మనసులు
ఎండిన గుండెలు
మురిగిన కన్నీటి సుడిగుండమ్ములు
ఆకలి గాల్చిన కంకాళాలూ -
ఆర్తి పరించే కదిలే శవాలూ
అతుకుల గతుకుల జీవన పథమున
అడుగిడి విరిగిన జగద్రథాలూ
అడుగడుగున అన్నార్తుల కేకలూ
సుడిబడి పగిలిన పేదల గుండెలూ
విలయ నృత్యములు చేస్తున్నాయ్
ప్రళయ వాయువులు వీస్తున్నాయ్.
తరుణోపాయం దీనికి ఒకటే –
తరుణార్కోదయ కాంతిజ్వలనం !
కస్తులు పస్తులు చిక్కు చికాకులు
కాలము చెల్లును సమాధి దాగును
సమతా మమతా నవ మహోదయం
సామాన్యునికై స్వాగత మిచ్చును,

# అమాయకప్పక్షి

కథానిక

ఫ్రెంచి

లియాన్ యూజినీ ఫ్రాఫీ

నాకేం కావాల్నంటారా, బాబుగారూ! క్షమించండి నాయనలూ, వాడి తల్లినేనండి. ఔనండి, వాడి తల్లినే. నా కొడుక్కి తల్లినండి. పొరపాటున కాల్చి చంపేశారు, నా కొడుకేనండి.

ఏమి అనుకోకండి బాబుగార్లూ, నా చెవులు ఆట్టే వినబడవు బాబూ! వాళ్లు చాల బాధపడుతున్నారంటారు బాబ్బాబు. ఔనండి. నిజమేనండి. పాపం వాళ్ళేమెరగరు. అదంతా ఎల్లా జరిగిపోయిందో. ఏమనుకోకండి. ఇంకెప్పుడూ అల్లా జరగనివ్వమన్నారండి. వారెంతో దయగా మాట్లాడేరు. ఎంత దయగానో – ఎంతో నొచ్చుకున్నారు. ఎంతో బాధ పడ్డారు. బాగా డబ్బు ముట్టచెప్తామన్నారండి.

మీకు జ్ఞాపకం లేదా బాబు! ఎల్లా జరిగిందంటే బాబయ్యా! కూర్చుని మాట్లాడితే ఏమి అనుకోరు కద, నిల్చుండ లేకున్నా బాబూ! పొద్దుట తొమ్మిదింటికి బయలుదేరా. అటూ, ఇటూ పట్నంలో సగంమేర చుట్టి వచ్చా బాబులూ. ఈ వీధిలో వున్న పోలీసు స్టేషను కెళ్లా మొదట. వాళ్లు హెడ్డాఫీసు కెళ్ళమన్నారు. అక్కడో పెద్దమనిషి ఈ కేసు చూస్తున్న సొలిసిటర్‌ని చూడమన్నారు. ఆయన పేరు మరచిపోయా. రాసిచ్చేరండి – ఆయన చాలా పనిలో వున్నారు – గుమస్తాగారు రాసిచ్చేరు. ఆయనే చెప్పేరు. మేజిస్ట్రేటుకి దరఖాస్తు పెట్టుకోమన్నారు. ఆ ఆఫీసరు గారు నన్నిక్కడి కెళ్లమన్నారు, బాబయ్యా. ఒకటే నడక దారి తప్పడం. బస్సులు. పట్నంలో సగంమేర తిరిగేనంటే నమ్మండి. మన కేమన్నా తొందర పనున్నప్పుడండి, బస్సులకోసం కూర్చోకుండా, నడిచెయ్యడం మంచిదండి. త్వరగా వెడతాం. అందులోనూ మనస్సు బావుండనప్పుడు ముఖ్యంగా.

ప్రమాదం గురించేనాండి. ఔను. బాబుగారూ! అదే చెప్తున్నా, ఇంటివాళ్లు లేనప్పుడు దొంగలు ఓ యింట్లో పడ్డారండి, పోలీసులు వాళ్లని పట్టుకోవాలని వచ్చేరండి. ఆ యింట్లో ఎవరూ కనిపించలేదు. ఇంటి వెనక కోసేసి ఇల్లెక్కి వుంటారనుకున్నారండి. వాళ్లకోసం వీధి పొడూగునా చూస్తున్నారన్నానాండి. ఆ రోజు శనివారం. ఎండ కాస్తూంది. నా కొడుకు హెన్రీ – వాడు ఇళ్లు నేసుకు బతుకుతాడండి. వాడు వీధిలో ఓ యింటి కప్పుమీద పెంకు వేస్తున్నాడండి. పోలీసులు, దొంగలు కప్పు ఎక్కేరనుకొన్నారన్నాను కదండి. కనిపించేరనుకొన్నారండి. తమకు ఎవ్వరూ కనిపించలేదనీ, భయపెట్టడానికి కాల్చేమనీ ఓ వారం పోయేక వారే చెప్పేరండి. కాల్చేరు. నా కొడుకు హెన్రీ తలలోంచి పోయిందండి గుండు.

చాల భయంకరమైన సంగతేనండి, మీరు చెప్పినట్లు. వాడిని ఇంటికి తీసుకు వచ్చేటప్పటికి కోటుకి ఇంకా రంగు కొంచెం అంటుకొనే వుందండి.

చాల ఏడ్చాను. మా పెద్ద రోజు కాదాండి.

మా హెన్రీ చాలమంచి కుర్రాడండి. ఎప్పుడూ నాతోనే వుండేవాడు, సాయం కాలాలప్పుడు కూడా ఎక్కడికీ వెళ్ళే వాడు కాదు. ఆ పనీ, ఈ పనీ చేసిపెడుతూ ఆడపిల్లలా ఎప్పుడూ కూడానే వుండేవాడండి. ఇంతలో ఇది వాడికిష్టమని ఎర్రచుక్కల నల్ల చొక్కా కుట్టి ఇంకా యిప్పటికి వారం కూడా కాలేదండి.

సందేహం ఏంవుందండి. నా కష్టం చూసి అంతా బాధపడ్డారండి. ఒక పెద్దాయన దరఖాస్తే రాసిపెట్టేరండి. దానిని పంపించేరు. కొంత సేపటికి ఎవరో వచ్చి నన్ను ప్రెసిడెంటు గారి దగ్గరికి తీసుకెళ్ళారండి. ఆయన చాలా దయగల మనిషండి. నేను గుమ్మంలో అడుగు పెట్టీపెట్టకుండానే ఆయన లేచి నిల్చున్నారండి, నా నోట మాట రాకుండానే – "అమ్మా అన్నీ విన్నా, నీకు చేయగల సాయం అంతా చేస్తాం, బతికున్నంత కాలం భరణం ఇస్తాం" – అన్నారండి. అవే మాటలండి. అయితే ప్రభుత్వానికి కాస్త వ్యవధి ఇవ్వాలన్నారండి. నేనక్కడ ఆ గదిలో వున్నది ఒక్క నిముషం కూడా లేదండి. అప్పటి నుంచి చూస్తూనేవున్నా. అప్పుడే ఏడాది అయిపోయిందండి.

మా కుర్రవాడి చావు గురించి మహా తిప్పలు పెట్టేసేరండి, మీకు తెలీదండి. విచారణల మీద విచారణలండి. ఎన్నెన్నో, ఏవేవో ప్రశ్నలండి. పోలీసులు అల్లాంటి అమాయికపు పిల్లల్ని కాల్చి చంపరనీ, ఆ పని చేసిందెవరో పట్టుకోవాలనీ వారి ప్రయత్నమండి.

చివరకి నాలుగు వారాల క్రితం వాళ్ళని పట్టుకొన్నారండి. విక్టరునీ, మరొకరినీ పట్టుకొని జైలులో పెట్టేసేరండి.

అందులో విక్టర్‌కి మరీ పెద్దశిక్ష వేసేరండి. నన్ను క్షమించాలి, అయ్యలూ! ఆ కుర్రాడి కోసమే మీదగ్గిరికి వచ్చేనండి. తమరి వలన పని అవుతుందన్నారండి .. ఇబ్బంది కలిగింది నాకు. చనిపోయినవాడు నా కొడుకు. కనకనే నేను అడుగుతున్నానండి . . . "నీకేం కావలసినా, ఇస్తామమ్మా !" అని ప్రెసిడెంటు గారన్నట్లు మా వీధి వాళ్ళందరికీ తెలుసండి. వాళ్ళందరూ నన్నెరుగుదురండి. ఆ వీధిలో నలభయ్యేళ్ళకి పైగా వుంటున్నానండి. ఈ మధ్య కాలంలో అందరూ నేనంటే ఎంతో ఇదిగా చూస్తున్నారండి, వీధే నెడుతుంటే పలకరిస్తారు. దుకాణదార్లు వెళ్లినప్పుడు దొరసాన్ని చూసినట్లు, చాల డబ్బున్న దాన్నిలాగా గౌరవం ఇస్తున్నారండి. నిజం కూడా అంతే కదండి – ప్రెసిడెంటు గారి మాటా మరొకటా.

విక్టరుకి ఓ స్నేహితురాలుందండి – ఆమె అతని పెళ్లమే అన్నారండి – నా దగ్గరికి వచ్చి, ఈ విషయంలో ఏమన్నా చేయగలవా అన్నదండి. ఎంత ఆలోచించినా, నేచెయ్యగల దేమిటో తెలియలేదండి.

బాబులూ! ఒక్క చిన్నమార్పు చేసుకోనివ్వండి. చిన్న మార్పు. ప్రెసిడెంటు గారు ఇప్పిస్తామన్న పెన్షను నాకివ్వ వద్దు కానీండి, దానికి బదులు విక్టర్‌ని క్షమించి వదిలి పెట్టించమనండి.

ఎలాగైనా, ముసిలి ముండను. ఎందుకు కొరగానిదాన్ని, నాకా అరవై

దాటిపోయేయి. నాకేం కావాలి. డబ్బా? ఏం చేసుకుంటాను? ఉన్నంతతో బాగానే నడుస్తూంది. పొద్దుటో మూడు గంటలు పనిచేస్తా. సాయంకాలం అయిదు గంటలు. గంటకి మూడు పెన్నీలిస్తారు. మధ్య మధ్య విందు లాంటిదేదో పని తగులుతుంది. అర్ధరాత్రి దాకా గిన్నెలూ, కంచాలూ కడగాలి. అయితే ఏదో పైగా ముట్ట చెప్తారండి. ఇంక నాకేం కావాలండి. పైగా వయ సొస్తున్న కొద్దీ కీళ్లు వంగడం లేదాయె. ఏ పనిలేకుండా కూర్చుంటే మరి లేవ లేకుండా అయిపోతా.

పెన్షను ఇక రాదంటే మా వీధిలో వాళ్లు ఇప్పట్లానే గౌరవిస్తారని చెప్పడం లేదు, బాబులూ! అయితే నేమండి. ఇంత క్రితం మాత్రం నన్ను ఎవరన్నా లెక్కగా చూసేరు కనకనా.

ఇంక విక్టరంటారూ. వాడు చెడ్డ వాడు కాదండి. కాస్త అశ్రద్ధమనిషి. అంతే, ఇంత క్రితం ఎప్పుడూ ఇలాంటి గొడవల్లో పడ్డవాడు కాదండి. వాడు కోర్టులో చెప్పింది నిజమేనండి. ఇతరు ల్లాగ అబద్ధాలు చెప్పేమనిషి కాదండి, అందుకే అంత శిక్ష పడిందండి, వాడు అయ్యో అనుకుంటున్నాడండి. నిజం గానే దుఃఖపడుతున్నాడండి. జైలునుంచి రాగానే ఆపిల్లను పెళ్లాడు తానన్నాడండి ఆమెకో పాప కలిగిందండి, విక్టరూ నా కొడుకు వయసువాడే. వాళ్లు పెళ్లి చేసుకుంటే నన్ను కాస్తకని పెడతారని పిస్తూంటుదండి. ఇప్పుడు నన్ను చూసే వాళ్లొక్కళ్లు లేరండి.

వెళ్లిపోతున్నారా బాబులూ! ఆఫీసు టైమైపోయిందా? నేను వచ్చిపోనూ, ఇంత సేపు మీపని పాడు చేశానేమోనండి మన్నించడి. పొద్దుట తొమ్మిదినుంచీ నడిచినదాన్ని నడిచినట్లున్నానేమో గంటలే తెలియలేదండి.

నేను చెప్పిన దంతా రాసుకున్నారు కదండి. చేయగలిగినదంతా చేస్తా మంటారు. మళ్ళీ రానక్కర్లే దంటారు, ఇంటికే వస్తుందంటారు. ఎంత మంచి బాబులూ! మీ మేలు మరిచిపోను. నాయనా! చాల మంచి బాబులు!

ఆ దారిని వెళ్ళాలంటారా, ఎన్నో గుమ్మాలు దాటి, ఎన్నోనడవల్లో నడిచే నేమో, వచ్చిన దారి మరిచే పోయేను బాబులూ. పైగా కళ్ళొకట్టి, సరిగ్గా కనబడవు బాబూ!

ఔను నాయనా! మీరిక్కడ గుమా స్తాగారా, బాబుగార్లకి కాస్త గుర్తు చేస్తుండండి నాయనా! - ఆలస్యం కాకుండా....

ఔను బాబూ! మీ కష్టం వుంచుకోను బాబూ! పెద్దగా ఇచ్చుకోలేను. ఈ కాస్త వుంచండి తమ వద్ద. తల్లిప్రాణం కదా బాబూ, అందుకే ఈ తిప్పటండి.

మానవజాతి అమాయికపు అహంభావం మీద విజ్ఞాన శాస్త్రం రెండు పెద్ద దెబ్బలు తీసింది. మన భూమి విశ్వానికి కేంద్రం కాదు, ఊహకు కూడా అందనంత విశాల విశ్వంలో అది ఒక అణవు మాత్రమే నన్నది మొట్ట మొదటి దెబ్బ. మానవుడు ఒక ప్రత్యేక సృష్టి వాదనీ, జంతు ప్రపంచం నుంచి వచ్చిన వాడు మాత్ర మేననీ చెప్పి జీవశాస్త్ర పరిశోధనలు రెండో దెబ్బతీశాయి.

(సిగ్మండ్ ఫ్రాయిడ్)

# గాథా సప్త శతి

## శాతవాహనుల కాలం నాటి సామాజిక పరిస్థితులు

### కంభంపాటి సత్యనారాయణ

(గత సంచిక తరువాయి)

శాతవాహనుల కాలంలో (క్రీ. పూ. 221 – క్రీ. శ. 218) వ్యవసాయం, పరిశ్రమలు, వ్యాపారం ఉచ్ఛస్థాయి నందుకొని, వర్గ వైరుధ్యాలు వృద్ధిచెందడం వల్ల, కలిమిలేముల మధ్య వ్యత్యాసం కొట్టొచ్చినట్లు బయటపడింది. హాలుని సంకలన గ్రంథం "గాథాసప్తశతి"లో చోటుచేసుకొన్న కొన్ని గాథలే యిందుకు తార్కాణం.

ఉదాహరణకు, ఒక కవి, పేదరికం యొక్క "ఘనత" ను వర్ణిస్తూ, యిలా చమత్కరించాడు (పద్యాలన్నీ శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మగారి తెలుగు అనువాదం "శాలివాహన గాథాసప్తశతీ సారము" నుండి):

ఎవరు సుగుణశాలు లెవ్వరు దారులు<br>
తెలివి మాగినట్టి దిట్టలెవ్వ –<br>
రట్టివారినెల్ల నరసి ప్రేమించెదు<br>
పేదరికమ! నీదు పెరిమ యెంత!

(పుట 121 I: 495)

మరో కవి తుచ్ఛుల కలిమిని మనోజ్ఞంగా వర్ణించాడు. లోకంలో గుడ్డి వాళ్లు, చెవిటి వాళ్ళే మంచి బ్రతుకు బ్రతుకు తారట ఎందుచేతో వినండి:

మనుజ లోకమందు గనులును జెవులును<br>
లేనివారి బ్రతుకు లెస్సచూవె.<br>
తులువలైన వారి కలిమి పెంపొందుట<br>
గనరు; వినరు కొండె గాండ్ర పలుకు.

(పుట 124 ; I : 509)

రసికుడు, దాత బనవాడు అడవిలోనైన బ్రతక వచ్చుగాని, పేదవాడై బ్రతక లేడంటాడు, ఒక కవి :

ఆకులును గొమ్మలును లేక యడవి నడుమ<br>
బొట్టి మోడిక నెందైన బుట్టి వచ్చు;<br>
గాని నరలోకమున జేత గాసులేక<br>
రసికుడై దాతయై పుట్టరాదు సూవె.

(పుట 47; I : 184)

రెండో వైపు, లోభి సంపద ఆ లోభికి సైతం ఉపయోగ పడదంటాడు, మరో కవి:

లోభివాని చేతిలోని సంపద యెంత
వెలయుచున్న సుంత ఫలము లేదు;
తెరుపు నడచు వేళ గరకు వేసవి యెండ
మాడు వానికి దన నీడ వోలె.

(పుట 26 ; I :104)

మరో కవి మాటలు:

అళుకుతో బ్రోచుకొను చుండవలయు, నెచ్చె -
లులకు నైనను వెలిపెట్ట నలవి గాదు,
పెరుగు నట్లెల్ల దాపంబు బెంచు బిసిని -
వారల ధనంబు, జారగర్భంబు వోలె.

(పుట 175 ; IV : 25)

గర్భవతి పేదరాలైతే, వేవిళ్ల సమయంలో తన కుటుంబ గౌరవాన్ని కాపాడేందుకెంత నిగ్రహంతో మెలగుతుందో వర్ణిస్తారు, యిద్దరు కవులు:

పేదరాలు నిండు వేవిళ్ల కాలమం
''దేమి వలతు'' వనుచు నెందరెన్ని
మారులడుగుచున్న ''మంచి, నీరే'' యను,
మగని గలతవెట్ట మనసు రాక.

(పుట 90 ; I : 360)

ఇంటి సత్తు వెరిగియుంట బేదల కోడ
లణచు కొనును గాని యాత్మలోన;
బయట జెప్పుకొనదు బైకల దనదు బం -
ధువులు చేసినట్టి దొసగు బోలె.

(పుట 58 ; I : 230)

వామయేవుడను కవి, పరుల సంపదను చూస్తూ భరించడం కష్టమంటాడు. ఎంత కష్టమంటే, ప్రియురాలు విరహబాధ నోర్వడ మంత కష్టం:

కానివారి సిరిని గాంచుట, వైద్యులు
లేని తెవులు, విభవహీనులగుచు
బంధు మధ్య మందు బ్రతుకును బోలు నీ
విరహ దుఃఖ మోర్వ దరమె దీని ?

(పుట 71 ; I : 285)

ఈశ్వరుడను మరో కవి, ప్రియుడు పేద వాడైతే ప్రేయసి పట్ల ధనికుని లాగే ప్రవర్తిస్తా డంటాడు:

పేదవాడు గూడ బ్రియురాలు కైవసం -
బేని ధనికునట్లె యెంచు దన్ను;

ఉర్వి యెల్ల జేతనున్నను బ్రియురాలు
లేనివాడు తలప లేనివాడె!

(పుట 97 ; I : 389)

శీత కాలంలో పేదవాని బట్టలెలా ఉండేవో, అజ్ఞాయుడు ఒక గాథలో వర్ణించాడు :

పొగదగిలి మాసి పిడుక నిప్పుకల కంపు
వట్టి పోగులు సడలిన ప్రాతగుడ్డ
గప్పుకొని యుండ నీ చలికాల మందు
పేదవాడని తెలియంగ రాదె వాని?

(పుట 65 ; I : 259)

## శ్రమజీవుల జీవనం

హాలుడొక చక్రవర్తే కావచ్చు. ఐనా, శ్రమజీవుల జీవనాన్ని చిత్రించే గాథలను తన సంకలనంలో చేర్చగల రసజ్ఞుడతడు. ఉదాహరణకు –

పైరు కోర్కిమీరి పండ శారద వేళ
బాడు నిచ్చుకొలది బలె రైతు
చక్కదంచినట్టి సన్నబియ్యము బోలు
వన్నె గలుగు నిండు వెన్నెలలను. (పుట 124 ; I : 507)

చేను దున్ను క్రొత్త సేద్య గాడదె చూడు!
కూడు దెచ్చి పెట్టు నేడె జూచి
కాడియెడ్ల పలుపు ద్రాడు సడల్పంగ
బోయి విచ్చినాడు ముక్కుద్రాడు. (పుట 124 ; I : 508)

ఒక గొల్లవానికి కొత్త పెళ్ళాం. ఐనా, మరో పడుచుతో సరసాలాడుతున్నాడు. ఆ సమయంలో కొత్త పెళ్ళాం వచ్చి యుక్తిగా అతని దృష్టిని మళ్లిస్తుంది. ఆ సన్నివేశాన్ని కవి యిలా వర్ణిస్తాడు.:

---

## ఎరుపు - విప్లవం

బొల్లిముంత నాగేశ్వరరావు

నీవేదో అణిచాననుకుంటున్నావు గానీ
అంతా అబద్ధం!
ఆ కుర్రవాడ్ని తీసుకుపోయి
అలుపు వచ్చేదాకా కొట్టావ్!
అయినా అతడనటం మానలేదు!
ఎరుపు వర్ధిల్లాలనీ,
విప్లవం జయించాలనీ!
మతులు శ్రుతులు తప్పి –
ఆవేశం ముంచు కొచ్చి
అర్ధ రాత్రే అడవికి తీసుకు పోయి
తుపాకీతో కాల్చి నపుడు
ఏం జరిగిందో తెలుసా?!
ఎర్రని రక్తం అతని వంటి మీది కొచ్చి
ఎరుపు వర్ధిల్లా లంది!
విప్లవం జయించాలంది!
ఇంకా ఏం చేస్తావ్ నీ విప్పుడు?
ఆ పిలుపు అందరూ
అందుకుంటున్నప్పుడు!

పాల కుండలు తెచ్చిన పడతి తోడ
సుదులకు గొల్లవాడు కూర్చొనగ, వాని
కొత్తపెండ్లాము చూడు! తల్లులు సడల్చి
నిండు రోసాన దూడలన్నిటిని విడిచె.

(పుట 129; II : 13)

మరో గొల్లవాడు, నైపుణ్యంతో పాలు పితకడం వల్ల ఆవు ఎక్కువ పాలిస్తుందట: దీన్నే కవి యిలా వర్ణిస్తాడు:

చేపినపుడు మున్నుచేయైన దడిగాదు;
గోవు నేడు చూడు; గొల్లవాడు
మేపి బుజ్జగించు మెలకువచే బాలు;
కడవ కొలది పితుక గలిగె నౌర.

(పుట 117; I : 457)

వేట గాండ్రను సైతం నాటి కవులు విడువలేదు. ఒక వేటగానిని చూచి రెండు జింకలు ఒక దాన్నొకటి రక్షించేందుకు జంటగా నిలబడ్డాయట. ఆ దృశ్యం వేటగాని హృదయాన్ని కరిగించిందట. కవి ఏమంటున్నాడో చూడండి:

ఒకటి నొకటి బ్రోచుటకు వింటికెదురుగా
జొచ్చుచుండు జింక జోడు సూచి
మనసు గలిగి బాష్పమున దోగు పెనువిల్లు
వేటగాడు జారవిడిచె నపుడు.

(పుట 112; I : 451)

ఒక చెంచు తల్లి తన కోడలిపట్ల కొడుకు మమకారాన్ని యిలా వర్ణిస్తుంది:

నా కొడుకు తొల్లియొక్క బాణమున జావ
గొట్టగలవాడు దొర యేనుగులను గూడ;
అంపమోపుల గొనిపోవు నదిగొ, యిపుడు
చూడు మడవికి! కోడలి చూపు మహిమ.

(పుట 116; I: 469)

## పల్లె – పట్టణం

శాతవాహనుల కాలంలో పల్లెలకు, పట్టణాలకు మధ్య వైరుధ్యం వృద్ధి చెందుతున్నట్లు కొన్ని గాథల వల్ల బోధపడుతుంది. నగర వాసులు మోసగాండ్రనీ, పల్లెవాసులు నిష్కపటులనీ ధ్వనించే గాథలు కొన్ని యీ గ్రంథంలో ఉన్నాయి. కవి ఈ విషయాన్ని ఒక జార వనిత చేత చెప్పించడమే విశేషం:

పల్లె బుట్టినాను, పల్లెలో నున్నాను
నిజము; పట్టణాల నేర్పెరుగ;
పట్టణాల వారి పతులు నా పాలు! నే-
నెటి దాననైతె నేమి? పోవె!

(పుట 126; II : 1).

దిసమొలతో బిడ్డ నెత్తుకొని నగరంలో తిరిగే ఒక బాలను తల్లి యీ క్రింది విధంగా హెచ్చరించడం చూస్తే, నాటి నగర జీవితం మీద కవి ఎంత గట్టి దెబ్బ తీశాడో బోధపడుతుంది:

నీకు వయసేమొ చిన్నది నిజము; కాని
దిసమొలను బిడ్డ! వీధిలో దిరుగ వలదు;
నగరముల నుండు ప్రాయపు మగలు జాణ-
లవధరింతురు "తల్లి - బిడ్డవలె" ననుచు,

(పుట 131 ; II : 20)

## గ్రామం, గ్రామ రెడ్డి

మన దేశంలో రాజవంశాలెన్ని మారినా, గ్రామీణ జీవితం మార్పు లేకుండా, గ్రామాధికార్ల దయా దాక్షిణ్యం మీద ఆధారపడి యుండేది. గ్రామంలో పన్నులు వసూలు చేసేదీ, శాంతి భద్రతల్ని కాపాడేదీ, నేరస్తుల్ని విచారించి శిక్షించేదీ గ్రామాధికారి, లేదా గ్రామ రెడ్డి. బయట నుంచి వచ్చే సాయుధ దుండగుల్ని ఎదుర్కొని గ్రామ ప్రజల్ని కాపాడేది కూడా అతడే. కాని, గ్రామ రెడ్డి నిరంకుశుడు; క్రూరుడు; దుర్మార్గుడు. అతని కొడుకు కూడా అంతే. ఈ విషయం "గాథా సప్తశతి" లోని కొన్ని గాథల వల్ల స్పష్టమవుతుంది. ఉదాహరణకు, హరియాలుడనే కవి ఏమన్నాడో చూదాం:

పెరచి నడచెదు భార్యకు; వేప చేదు
గుడుచు పురువట్లు; పెదరెడ్డి కొడుకవయ్యు;
కటికవాడవు; నిను జూడ గనుపె కడిది;
కాని నీకోస మూరెల్ల గాసిపడెడు!

(పుట 6 ; I : 22)

గ్రామీణులు తమ్ముతాము కాపాడుకొనేందుకు దూర ప్రాంతాలకు వలస పోవడం ఆ రోజుల్లో పరిపాటి కాబోలు. అలా అందరూ వలసపోతే, గ్రామంలో మిగిలేదెవరు? భూముల్ని సాగుచేసేదెవరు? రెడ్డి అధికారం చెల్లేదెలాగు? దీన్నే కవి ఒక గాథలో యిలా చెప్పాడు:

వింధ్యగిరికి వలస వెడలెడు సుద్ది యీ
పల్లెలోన నెత్త వలదు; రెడ్డి -
కూపిరాడు చున్న; దొకవేళ బ్రతికి యీ
మాట వినిన జచ్చు మాట నిజము.

(పుట 116 ; I : 470)

రెడ్డి తన అవసాన దశలో కొడుకును పిలిచి, తనలాగ పాడు బ్రతుకు బ్రతక వద్దని హితవు చెబుతాడు: కవి మాటల్లోనే చెప్పాలంటే:

బుద్ధిసెప్పె రెడ్డి పుత్రుని బిల్చి ప్రా -
ణములు వదలు వేళ, "నాదు పేరు

సెప్పుకొనుచు సిగ్గుచేటుగా బల్లెలో
బంద బ్రతుకు బ్రతుక వలద'' టంచు. (పుట 116 ; I : 471)

రెడ్డి కూతురు కూడా తక్కువేమీ తినలేదు. కవి ఆమెను విషపు తీగతో పోలుస్తాడు :

మరులు నించు నింత చిరుత ప్రాయము సందె ;
జుత్తెడైన లేదు చూడు మరల !
పెరిగెనేని రెడ్డి బిడ్డ యనర్థంబు
దెచ్చు నిజము, విసపు దీగవోలె. (పుట 81; I : 324)

ఆ రోజుల్లో నేరస్తులకు విధించే శిక్షలు చాల క్రూరంగా ఉండేవి. ఉదాహరణకు, ఆసనంలో శూలం దిగగొట్టేవారు. పవరసేణుడను కవి, ఒక గాథలో, దేవాలయపు గోపురం మీద కనబడే మేకు దగ్గర పావురాలు చేరి మూల్గడాన్ని వర్ణిస్తూ, శూలమెక్కించి నపుడు నేరస్తుడు బాధ కోర్వలేక ఏడుస్తున్నట్టుందంటాడు: (పుట 13 ; I : 47)

గ్రామ దేవతలకు, గృహదేవతలకు బలిపూజ ఆచారాన్ని యిద్దరు కవులు తమ గాథల్లో వర్ణించారు : (పుట 39 ; I : 152;) (పుట 41, I : 162)

ఆ రోజుల్లో విదేశవ్యాపారం కొరకు ఓడలమీద ప్రయాణం చేసేవారు తమ వెంట "ఓడ కాకి" ని తీసుకెళ్లేవారు. ఓడ సముద్రం మధ్య ఉన్నప్పుడు తీరం ఎంత దూరంలో ఉందో తెలుసు కోడానికి యీ "ఓడ కాకి" ని పైకి వదలేవారు. అది చాలా దూరం ఎగిరి వెళ్ళి, తీరం కనబడితే అక్కడే ఉండిపోయేది; కనబడకపోతే తిరిగి ఓడమీదికి వచ్చేది. అలా ఆశాభంగం పొందిన "ఓడ కాకి" ప్రేమించి పరాభవం పొందిన పడతి ఒకేలా ఉంటారంటాడు, మరో కవి : (పుట 133 ; II : 25)

---

## మారిందేమిటి!

 మురారి

అధికారపు పెనుగులాట
అదుపు దప్పి 'ఢీ' కొంటు
జబ్బ చరుచుకున్న మీరు —
దబ్బున దిగ జారారేం ? !

ప్రత్యర్థుల బలం జూచి,
పిరికి పందలై మరె ;
చెంపలు వాయించుకొని,
చేయి చేయి కలిపారా !!

కల్తీ వ్యాపారం జాతిని
కలవర పెడుతూ వుంటే ;

ఆకలి చావులు నిత్యం
అధికమ్మై పోతుంటే ;

పచ్చి దుండగీళ జాలుం
పెచ్చు పెరిగి పోతుంటే;
బలహీన వర్గాలకు,
బ్రతుకె కష్టమవుతుంటే ;

నడివీధిన అన్యాయం
నగ్న విహారం చేస్తుంటే;

ధనవంతుల గుప్పెట్లో
ధర్మం 'చెర' పడుతూంటే;

అధిక ధరలు వీసమైన
అదుపులోన పెట్టారా ? !
నిరుద్యోగ జన శాతం
నిరుటి కన్న తగ్గిందా ? !

పొట్టి సొల్లు కబుర్లతో
పొరిగే దేమిటి ప్రజలకు ?
అందల మెక్కించి నోళ్లా
అఖాతాన తోయగలరు.

## దేశాంతరయానం

వ్యాపారం కొరకు దూర దేశాలు వెళ్ళిన భర్తలకోసం భార్యలు ఎంతో విలపించేవారు. రోజులు లెక్కపెట్టుకొంటూ, వారి రాకకోసం ఎదురు చూచేవారు. ఒక గృహిణి గోడమీద వేసుకొన్న గడువు గుర్తు వానసీళ్లకు చెడిపోకుండా చేతులడ్డం పెట్టిన ఉదంతాన్ని జయసేణుడిలా వర్ణించాడు :

పూరి కొట్టము పెద్దగాడ్పునకు జెదర,
లోన దిగు వాన సోనల నానకుండ,
గడువు దినమని గోడపై నిడిన వ్రాత
జేతులడ్డము పెట్టి ప్రోచెడిని గృహిణి.

(పుట 33; I : 132)

పాలితుడను యింకో కవి కూర్చిన గాథ:

"కడచె నిన్నినాళ్లు గాలు సేతుల వ్రేళ్ళ
నొక్కటొకటిగాగ లెక్కపెట్టి ;
ఇంక మీద దినము లేమిట లెక్కింతు"
ననుచు నేడ్చు చున్న దకట ముగుద.

(పుట 60 ; I : 240)

పరదేశమేగిన వ్యక్తికై విలపించే అత్త — కోడండ్ర దుఃఖాన్ని కవి ఎంత హృద్యంగా వర్ణించాడో చూడండి :

"నేడు పండుపు నాడు సూ ; నీ ప్రియుండు
వచ్చు నిజముగ ; నేడువ వలదు బిడ్డ ;"
అనుచు గోడలి నూరార్చి కొనుచు మొగము
ఆవలకు ద్రిప్పి తానేడ్చు నత్తగారు.

(పుట 139 ; II : 50)

బందిపోట్లు ఆ రోజుల్లో ఊళ్లను కొల్లగొట్టుకు పోవడమే కాక, స్త్రీలనెలా అపహరించుకు పోయేవారో రెండు గాథల వల్ల బోధపడుతుంది :

(పుట 11 ; I : 42. పుట 99 ; I : 399).

## వేశ్యావృత్తి

శాతవాహనుల కాలంలో వేశ్యావృత్తి అనేక వృత్తుల్లో ఒకటిగా ఉండేది. ఆ వృత్తి మూడు పూవులు, ఆరు కాయలుగా వర్ధిల్లాలంటే పడుపుకత్తె ప్రయోగించవలసిన లాఘవాలను గురించీ, అలవరచు కోవలసిన శిక్షణను గురించీ వాత్స్యాయనుడు తన కామ సూత్రాలలో చాలా వ్రాశాడు. అతడు శాతవాహనుల కాలంలో జీవించిన వాడే. రాజులు, చక్రవర్తులు వేశ్యావృత్తిని పెంచి పోషించేవారు. కాని, వేశ్యలు సమాజ జీవితానికి వేరుపురుగులనే అభిప్రాయం అనాటికే సంస్కారవంతుల్లో నాటుకొంది. "గాథా సప్తశతి"లో యీ విషయం మనకు చక్కగా బోధపడుతుంది. ఉదాహరణకు, ఒక కవి వేశ్యల్ని నమ్మరాదనీ, ప్రయోజనపు హద్దు మీరవద్దనీ అంటాడు :

ఇచ్చకాలు పల్కి మెచ్చించునట్టి దీ-
జాతి; నమ్మియుండ జనదు దీని;
గొడుక! తమ్మయంత వెడలుపుగా జెవి
బొడుచు కొనగ నెవరు బోరు, చూడు.

(పుట 129; II : 10)

మరోకవి, ఎట్టి విటుల్ని వేశ్య చేరదీస్తుందో చెబుతూ, యిలా అంటాడు :

"సొమ్ము చాల గలదు; సోమరులకు మేటి;
పోకిరీలకెల్ల బోటు మగడు;
అతని గంటె బిడ్డ?" యని చెప్ప విన్నంత-
నతివ కనులు చేరెడంతలయ్యె.

(పుట 181; IV : 48)

ఇంకో కవి, వేశ్యల ఆస్తి అట్టి వారికే దక్కుతుందంటాడు. అతని మాటలు :

పుడమి గూళజనము గడియించు నాస్తికి
బాత్రు లెవ్వరట్టి వారెగాక!
వేపమ్రాన బండ్లు వెలసిన గాకులే
వచ్చి వాని దినగ వలయు గాదె!

(పుట 51; I : 198)

## కుల భేదాలు

ఆనాడు కులవ్యవస్థ లోతుగా వేళ్లూనినప్పటికీ, కుల భేదాలు ఎంత హానికరమైనవో కొందరు బుద్ధిమంతులు గుర్తించారు. ఉదాహరణకు, వసుయావి అను కవి ఎంత నిశితంగా కులాల్ని ఖండించాడో చూడండి :

ఎదకు గూర్చువారి నెడబాసి, యొల్లని
వారి జూచు చుండవలయ ననెడు
కడిది పనులు రెండు గావించు నీచేత
గులము; దీని ద్రొక్క వలయు బిడ్డ.

(పుట 5; I : 19)

పాలితు డను మరో కవి, క్రింది కులానికి చెందిన స్త్రీ చేత ఉన్నత కులానికి చెందిన మరో స్త్రీని యిలా వెటకారం చేయిస్తాడు :

నిజము చెడిపెల మేమెల్ల; నీది మచ్చ
లేని కులము; పతివ్రత; లేచి పోవె!
కాని, మాకెవ్వఁకిని మంగలిని వలచు
నెరతనము లేదొకానొక గరిత బోలె.

(పుట 82; I : 329)

మంగలి కులం యీ రెండు కులాల కంటె హీనంగా పరిగణింప బడేదని పై మాటలో ధ్వనిస్తుంది! అన్నికులాలూ సమానమనే భావం ఆనాటి కవుల్లో యింకా కలగ లేదను కోవాలి. (సమాప్తం)

కథానిక మణిపురి

# హిల్సా చేప ఎంత రుచి!

ఎస్. కుంజ మోహన్ సింగ్

మబ్బుల్లేని ఆకాశంలో చుక్కలు మినుకు మినుకు మంటున్నాయి. అప్పుడప్పుడు ఒకటో రెండో తోకచుక్కలు అడ్డంగా పరుగెట్టి పడిపోతున్నాయి. చేరువలోనే పారుతోన్న బోరక్ నది నీటి రొద గాలిలో కొట్టుకొచ్చి వినిపిస్తోంది.

ఇంకా తెల్లవారలేదు. నదిలో పిట్ట మనిషయినా కదులుతున్నట్టు కనిపించలేదు, పడవలోని ఒక తండ్రీ కొడుకూ తప్ప. కొడుకు తెడ్డేస్తున్నాడు. తండ్రి చేపల వలకు కుట్లేస్తున్నాడు. తండ్రి కలయజూసి, కొడుకును కేకలేశాడు. ''అరే మణీ! పొద్దు పొడవబోతోంటే ఎందుకురా అలా కునుకుపాట్లు పడుతున్నావు? కళ్లకి మిరపకాయలు రుద్దేదా? చూడూ, చన్నీళ్లతో మొహం కడుక్కో''.

మణి తెడ్డు పడేసి, మొహం కడుక్కోవడం మొదలు పెట్టాడు. తన గావంచా చెంగుతో మొహం తుడుచుకున్నాక మళ్ళీ తెడ్డు తీశాడు.

కొడుకు మారు మాటాడకుండా తను చెప్పినట్లు చేసినందుకు, తండ్రికి మమకారం పుట్టినట్టుంది. అతను బీడీ, అగ్గి పెట్టె చినిగిన తన కబ్బా కుడి జేబు నుంచి తీసి, ''ఇదిగో, నాదగ్గిరో బీడీ ముక్కుంది వెలిగించుకో, రెండు మూడు గుక్కల్లాగి నాకియ్యి'' అన్నాడు.

మణి బీడీని పెదాల మధ్య పట్టి, అగ్గిపుల్ల గియ్యడానికి ప్రయత్నించాడు. రెండు మూడు సార్లు గియ్యడానికి ప్రయత్నించినా, బీడీకి నిప్పంటుకోలేదు. మణి కోపంతో కస్సు బుస్సుమంటూ, దాన్ని నీట్లో ముంచేద్దామనుకున్నాడు.

కొడుకు చేస్తున్నది తండ్రి చూసి, ''నేను గీసి చూస్తానివ్వరా, అగ్గి పెట్టెలకీ రోజుల్లో రెండు పక్కలా మందు సరిగ్గా వుయ్యరు. డబ్బు లాగడానికిదో పితలాటకం'' అన్నాడు. ఆలా అంటూ, అతను దగ్గరగా వొచ్చి అగ్గి పుల్ల గీసేడు.

గట్టిగా, తృప్తిగా బీడీ దమ్ము లాగడం పూర్తి చేసేసరికి ''భోంభోలా నాథ్! జయ శివశంభో!'' అన్న పెద్ద కేక వినిపించింది. అవతల ఒడ్డున జడలు కట్టిన జుట్టుతో వున్న సాధూ గారు ఉదయం పూట బిగ్గరగా చేసే ప్రార్థన అది.

ప్రతిఒక్కరికీ తెలుసుసాధుగారు మేలుకొంటే యిక తెల్లవారుతుందని తక్కిన వాళ్ళుకూడా నది మీదిగా వచ్చేస్తారు.

ఈలోగా తండ్రీ కొడుకులు లంగోర్ బాబా లోయ నీటి వెపుగా తమ పడవను నడుపు కొంటూ వచ్చారు. నదిలో యీ ప్రాంతానికి వెళ్ళడానికి సాధారణంగా జంకుతారు గాని, అక్కడ ఎప్పుడూ దండిగా చేపలుంటాయి.

వలలో కుదిపినట్లనిపించి, తండ్రి దాన్ని పైకి లాగేడు. కాని దాన్లో ఏమీ కనిపించలేదు. పడవ చేరువలో చేప ముట్టెకనిపించింది, వెక్కిరిస్తున్నట్టు.

ఒకటి రెండు సార్లు వల విసిరేరు. కాని ఫలితం శూన్యం. తరవాత దక్షిణ దిక్కు వేపుగా సాగిపోయారు.

ఆ సరికి ఐదారు పడవలు అక్కడ చేరాయి. బాగా తెల్లారింది కూడా. నూరెం కుటుంబం వాళ్ల ఘాటు వేపుగా కాస్తంత పోయారు. వాళ్ళకు అదృష్టం వచ్చి పడింది. ఇప్పుడు వలలో ఒక పెద్ద హిల్సా చేప కనిపించింది, దొర్లు కుంటూ, వెండిలాగా తెల్లగ మెరిసి ఎగురుకుంటూ. ఒక్క లిప్తలో యిద్దరి ముఖాల్లోనూ కళ ఒచ్చింది.

వెంటనే యిద్దర్లోనూ చిన్నవాడయిన మణి నోటంబడ, "బలే చక్కగా వుంది! నాయనా అది ఎంత కమ్మగా వుంటుందనీ!" అన్న మాటలు వచ్చాయి.

"గమ్మునుండు! బుద్ధితక్కువ మాట లాడకు" అంటూ తండ్రి కొడుకును మందలించాడు. ఘాటు వేపుకు ఎవరో వస్తుండడంతో, తండ్రి అటు తిరిగి చూస్తే, నూరెం కుటుంబం వాళ్ల లావాటి పెద్దాయన తమవేపు చూస్తూ కనిపించాడు. "ఓరి మణితండ్రి, మణితండ్రీ!" అని అతడు బిగ్గరగా పిలుస్తున్నాడు.

మణి తండ్రి కాస్సేపు వినిపించ నట్టుగా ఊరుకున్నాడు. తనకి ఆయన గారితో సరిపోదు. చేపను తనకు అమ్మ మనడానికే ఆ పిలుపు అని అప్పటికే అతనికి అర్థం అయ్యింది. తక్కిన వాళ్ళు సాధారణంగా ఇచ్చే ధర, అతను ఎప్పుడూ యివ్వడు. పుష్కలంగా డబ్బున్నా, యుగాలు బేరమాడుతాడు.

అదే పనిగా పిలుస్తోంటే జవాబివ్వక తప్పింది కాదు మణి తండ్రికి. "పెద్దయ్య గారూ, ఏంటంటున్నారు?"

"ఏమాత్రం పడ్డాయిరా?" అనడి గాడు, ఆ పెద్దాయిన. "నాకొకటి అమ్ము. పాకిస్తాన్ నుంచి చేపల సరఫరా ఆగి పోయినప్పటి నుంచీ, మేమంతా నోరు వాచి వున్నాం. చేసేది లేక భరించి పూరుకున్నాం — జిహ్వ పడిపోయింది. ఆరోగ్యమూ బాగా దెబ్బతినింది."

ఆ పెద్దాయన వచ్చి పిసనారితనం గురించి, కడుపు మాడ్చు కోవడం గురించీ, మణి తండ్రి తనలో తాను గొణుక్కున్నాడు. అనక వినిపించీ వినిపించ నట్టుగా, "యిది కాక మరేమీ పడ లేదండి" అని జవాబిచ్చాడు.

"సరే, అది నాకిచ్చెయ్."

"బాబ్బాబు, యియ్యేళ మమ్మల్ని కాయండి. ఇదొక్కటే పడింది కాబట్టి మేమే ఉంచుకుంటామండి."

ఒప్పుకునేలాగా లేడని, ఆయనిక పట్టు పట్టలేదు.

కాని యీ పెద్దాయన్ని చూడ్డం వల్ల మణి తండ్రి కొచ్చిన చికాకు తగ్గ లేదు. "యితగాడి మొహం చూస్తే చాలు, శని పట్టుకుంటాది" అని గొణిగాడు. దానికి కొడుకు తన మాటలు కొన్ని చేర్చాడు. "యితగాడంటే నాకూ అసయ్యమే. మొన్న యితని కొడుకు తోమాల్ నన్ను కొట్టాడు. అప్పుడ్నేను..."

అది పూర్తి కాకుండానే, తండ్రి ఏదో గొణిగాడు, రహిముద్దీన్, అతని కొడుకూ వలలో ఒక చేపను లాగు తుండడం చూసి. "యీళ్ళ పంట పండింది. నది మీది కొచ్చారో లేదో చూడు ఎలా దొరికిందో."

రహిముద్దీన్, నేర్పుగా చేపను వల నుంచి విడదీసి, పడవలో పడేసి, "ఓ చౌబా అన్నా! ఎంత పట్టావు?" అని కేకేశాడు.

"అట్టే లేదు. ఒక్కటే."

"అయినా నీకష్టం దండక్కా లేదులే.

నిన్న నాకు మూడు పడ్డాయి. అన్నీ ఒకోక్కటి నాలుగేసి చొప్పునమ్మాను.''

''అవును. అమ్ముకుంటే నారూ పైస లొస్తాయి. కాని అమ్మను. కుర్రదాన్ని కూటికి రమ్మని పిలుద్దామను కుంటు న్నాను. దానికి నెలలు నిండాయి. నిజం చెప్పాలంటే, హిల్సారుచే మర్చిపోయా. దొరికి నప్పుడల్లా అమ్ము కోవడమే అయిపోతోంది. యియ్యేళ దాని రుసి తగులుల్తాది!''

తండ్రీ కొడుకు యింటికి వచ్చే సరికి పూరి కొంప పంచ నీడను బట్టి, బాగా పొద్దెక్కిందని తెలిసింది. కూతురు తంపా చేసి తెచ్చిన పాలులేని టీ మెల్ల మెల్లగా తాగుతూ చోబా కుదుట పడుతున్నాడు. గుమ్మాని కవతల ''చోబా, ఓ చోబా హిల్సా పడిందంట నిజమేరా?'' అని అరుస్తున్నాడు. కోన్‌సం కన్హయ్ గొంత కేనని, అతను పోల్చుకున్నాడు.

కన్హయ్ గొంతు వినిపించ గానే, అతనికి వెన్ను పూసలో ఒణుకు పుట్టింది. కన్హయ్‌కి తాను రెండుంబా వల బాకీ వున్నట్టు, హటాత్తుగా అతనికి జ్ఞాపకం వచ్చింది. చౌబా జబాబివ్వ డానికి ముందరే, అతని చిన్న మాటల పోగు కొడుకు ముందుకొచ్చి ''అవును, పెద్ద చేపే పడింది'' అని చెప్పేశాడు.

ఆ మాటలు కన్హయ్ విన్నాడో లేదో గాని, చౌబా ''కుర్రవెధవకి నోరూ రుకోదు! ఆ సంగతి నీకెందుకురా?'' అని కసిరాడు. గుమ్మం వేపు చూస్తూ ''ఒక్క చేపయినా పడలేదండీ. మీకెవళ్లు చెప్పారు?'' అని అడిగాడు.

''సరే, నీకేమీ దొరక్క పోతే పోనీలే'' అంటూ, కన్హయ్ వెళ్లాడు.

కాని కుర్రాడు ముక్తాకు నాలిక ఊరికే వుండదు ''యియ్యాళ, కూటికి మాంచి చేపుంది. అది యింత పెద్దది. నాయన నదిలో పట్టాడు. అది నువ్వె ప్పుడైనా తిన్నావా?'' అని తనతో ఆడుకునే తోమ్‌చొకు చెప్పకపోయాడు, చేతులూ, కళ్లూ ఆడించుకుంటూ.

సరిగ్గా అప్పుడే వాడి అక్క తంపా, తండ్రికోసం హుక్కా తెచ్చి, ''నాయనా పొయ్యి మీదికి బియ్యం లేవు. ఏం చెయ్య మంటా?'' వని మెల్లగా అంది.

ఇది విని చౌబా రాస్సెపు కూతుర్ని తేరి పారచూశాడు. ఒక్క క్షణంలో హుక్కా కాల్చాలని పించలేదు. సరిగ్గా, అప్పుడే, వాళ్ల నేడో రేపో చచ్చేటట్టున్న ముసలి కుక్క, బొచ్చంతా ఊడి, అస్థి పంజరంలాగా వున్నది, కుంటు కుంటూ వాకిట్లోకి వచ్చింది. పాపం, ఆ బక్క ప్రాణం యీ దుర్‌రదృష్టమంతటికీ ఎర కావలసి వచ్చింది. దాన్ని చూసీ చూడగానే, చౌబా ఎంతగా మండి పడ్డా డంటే, తాను కూర్చొని వున్న కర్ర కుక్క వేపు విసిరేడు. ఎలాగో దెబ్బ తప్పింది. బహుశా దాని నిర్దోషిత్వం దాన్ని తప్పించుంటుంది. కుయ్యి కుయ్యి మంటూ, గుమ్మం వేపుకు పరుగెత్తింది.

చౌబా లోపల ఇంకా కోపం రగుల్తూనే వుంది. అతడు ఇంటి లోపలి కొచ్చి చాలా కాలం మంచం పట్టివున్న భార్య మూలుగులు విన్నాడు. కొద్ది క్షణాల క్రింద జరిగింది తెలియక అవిడ నీరసంగా ''బియ్యం లేవని పిల్లచెప్పింది విన్నావా? ఏంచేస్తావు?'' అనిఅడిగింది.

చల్లారుతున్న కోపం మళ్ళీ రగు ల్కొంది. ''హూ - నేనొక్కణ్ణే యీ పాట్లన్నీ పడలేను. ఎప్పుడూ అందరినీ హింస పెట్టేకన్నా, నువ్వు చావు.''

బయట్నుండి ఎవరో పిల్చి అడ్డు తగలక పోతే, అతను తన బాధల్ని

యింకా ఎక్కువగా వెళ్లగక్కిస్తూ వుండే వాడు, ఎవరో చూద్దామని బయటి కొచ్చాడు. అతను ఎవరో కాదు తనిన్ జవో అని చూశాక, తన మొహం ముడుచుకు పోతుంది.

"ఏం పని బాబు" అనడిగాడు.

"పనేమిటంటే మా అమ్మాయి తెల్లైనా యీ వేళ యింటి కొస్తుంది. దాని కోసం ఒక్క చేపయినా కనిపించ లేదు. నువ్వేదో చేపలు పట్టేవని తెలిసి, అందు కోసం నేను వచ్చాను" అంటూ తనిన్ జవో జవాబిచ్చాడు.

"ఓ – అదొక్క చేపే. రండి. చూసు కోండి!" యీ మాటలు చెప్తూ, చౌబా అతనికి యింట్లోకి తీసుకెళ్లే చేప చూపాడు.

"ఎంతడుగుతావు?" అనడిగాడు తనిన్ జవో.

నాలుగిప్పించండి. బోరక్ నదిలోని హిల్సా. మంచి కమ్మగా వుంటుంది."

"సరే, మూడున్నరిస్తాను" అంటూ తనిన్ జవో, చేపనెత్తి పరిక్ష చేశాడు.

"ఇప్పుడే పైస లిప్పించండి. బియ్యం కొనుక్కోవాలి".

"అలాగే, అలాగే. యిబ్బంది పడకు. డబ్బో బియ్యమో ఇస్తాను. అని తనిన్ జవో చేపను పట్టుకొని బయటికొచ్చాడు.

చిన్నకుర్రాడు ముక్కా వాకిట్లో అతన్ని చూసి, "నాయనా, మన చేపని తీసుకెళ్లి పోతున్నారు" అని కేకేశాడు.

దీనికి, కులాసాగా తనిన్ జవో "ఏమీ యివ్వకుండా ఎత్తుకెళ్లడం లేదురా. పైస లిస్తున్నానురా" అని జవాబిచ్చాడు.

కుర్రాడికిక నోరు పెగల లేదు. చడీ చప్పుడూ లేకుండా నిలబడి పోయాడు. చేపను తీసుకెళ్ళుతుండడం అదే పనిగా చూస్తూ.

# రచయితా హంతకుడే!

## మల్లాది వెంకట కృష్ణమూర్తి

ఒకసారి ఓ దోషిని వురి తీయబోతూ ఒకటి, రెండు, మూడు అంటూ అంకెలు లెక్క పెట్టసాగారు. పది దాక లెక్క పెట్టాక ఆ దోషి కంఠం చుట్టూ వున్న వురి తాడు బిగుసుకుని, కొన్ని నిముషాల తర్వాత అతని శవం వురి కంబం మీద వ్రేలాడుతుంటుంది.

అయిదు లెక్క పెట్టాక, వురి కంబం మీదకి ఒక పాము జరజర పాకుతూ రావటం గమనించి, ఆ దోషి దానికి దూరంగా జరిగాడు కంగారుగా. వురి తీసే అధికారి ఆ దోషి భయం చూసి చిన్నగా నవ్వి అడిగాడు:

"మరో అయిదు క్షణాల్లోగ చావ బోతున్నావు కదా. దాన్ని చూసి ఎందుకు జడుస్తావు?"

ఈ ప్రశ్నకి సమాధానం అందరికీ తెలిసిందే. ప్రాణం మీద తీపి జీవులకి సహజంగా పుట్టుకతోనే ఏర్పడుతుంది. మృత్యువుని సాధారణంగా ఎవరూ కాంక్షించరు.

రచయిత కూడా ప్రాణాల మీద తీపి వుండే సాధారణ మానవుడే. అలాటి సామాన్య మానవుడు తన కథల్లో తను సృష్టించే పాత్రని ఎందుకు నిర్దాక్షిణ్యంగా చంపేస్తాడో? జీవితంలో తను వాంఛించని చావుని సాహిత్యంలో ఎందుకు చోటు చేసుకోనిస్తాడు? ఈ విధంగా రచయిత కూడా (కాగితం మీదే) హంతకుడవుతున్నాడు ఒక విధంగా.

సాహిత్యంలో మృత్యువుకి పెద్ద పాత్రే వుంది. అది రచయితకి బాగా

సహాయపడుతుంది, మంచి కథ అందించడానికి. కథల్లోని పాత్రలు మరణించడానికి చాలా కారణాలున్నాయి. వాటిలో ముఖ్యమయినవి, ముచ్చటగా మూడు.

ఒకటి. పాత్ర మీద సానుభూతి కలిగించడానికి.

రెండు. కథా గమనానికి.

మూడు. పాఠకులని మెప్పించడానికి. కథలోని ఓ పాత్ర జీవించి వుండే కన్న, చచ్చి పోతేనే పాఠకుడికి ఆ పాత్ర మీద సానుభూతి కలిగి, ఆ పాత్ర ఎక్కువ రోజులు గుర్తుండి పోతుంది. అలాంటప్పుడు రచయిత ఆ పాత్రని మృత్యువు ద్వారా ముగించేస్తాడు. దాంతో పాఠకుడికి జాలి, లేదా విచారం కలిగి 'అయ్యో!' అనిపిస్తుంది. పాఠకులకి ఆ భావన కలిగేలా చేసి, కథని, ముఖ్యంగా ఆ పాత్రని గుండెల్లో గుచ్చు కునేలా చేయడానికి రచయిత వాడే ఆయుధాల్లో మృత్యువు ఒకటి.

అయితే ఆ పాత్రలు వున్నతమయినవో, చలాకిగా వుండేవో, చిన్న వయసు కలిగి వుండేవో అయివుంటే, అప్పుడు రసోత్పత్తి కలుగుతుంది చదువరులకి.

అందరికి తెలిసిన వుదాహరణ, దేవదాసు. శరత్ బాబు దేవదాసు పాత్రని మృత్యువుతో అంతం చేయక పోతే, ఆ పాత్రకి, ఆ కథకి అంతగా గుర్తింపు లభించేది కాదేమో? లైలా మజ్నూ, కింగ్ లియర్‌లు కూడా ఇదే కోవకు చెందే పాత్రలు.

మొపాసా వ్రాసిన 'కోకో' అనే కథలో, పని చేసే శక్తి లేదని తిండి పెట్టకుండా ఓ గుంజకి కట్టేసి గుర్రాన్ని కద్దాన్ని మాడ్చి చంపుతాడు. కేవలం గుర్రం, మరణానికి సంబంధించిన ఈ కథ హృదయానికి హత్తుకునేలా వుంటుంది.

రెండవది, కథాగమనం. ఒక పాత్ర తప్పనిసరిగా నిష్క్రమిస్తే కాని ఇక కథ నడవని పరిస్థితి ఏర్పడినప్పుడు, దాన్ని అంతం చేయాల్సి వస్తుంది. పాఠకులకి తెలిసిపోతుంది, ఆ పాత్ర బ్రతికే వుంటే ఇంక కథ నడవదని రచయిత ఆ పాత్రని తప్పించేసాడని. సాధారణంగా ఇద్దరబ్బాయిలు, ఒక అమ్మాయి లాంటి ముక్కోణపు ప్రేమ కథల్లో తరచు జరుగుతుంటుంది.

మూడవది పాఠకులని మెప్పించడానికి రచయిత కొన్ని పాత్రలని చంపుతాడు. కథ చివర దాకా హీరో, హీరోయిన్లని అనేక కష్టాలు పెట్టే దుష్ట పాత్రలు బ్రతికి వుండే కంటే, చచ్చిపోతేనే, ముఖ్యంగా హీరో చేతిలో మరణిస్తేనే పాఠకులకి హాయిగా వుంటుంది.

ఓ పాత్ర మరణం గురించి తెలియ చేయడానికి, ఆ అర్థం వచ్చేలా, భావ గర్భితంగా వ్రాసిన వాక్యాలు రచయితలు కొందరు వాడుతుంటారు.

"నిర్జీవంగా కుర్చీలోకి వాలిపోయాడు మధు. ఆతని చేతిలోని వుత్తరం గాలికి ఎగిరి పోయింది."

"కళ్ళు మూసుకున్న అంజనేయులు ఇక ఎప్పటికి ఆ కళ్ళు తెరవలేదు."

"ఆ వార్త వినగానే కుప్పలా కూలి పోయాడు రాజశేఖరం. దూరంగా తీతువు పిట్ట వికృతంగా అరిచింది."

"చాలా దూరం ... ఇక తిరిగి రానంత దూరం వెళ్ళి పోయాడు మధుసూదనం."

"ఉదయం లేచి చూసే సరికి తన తండ్రి వంటి మీద పాకుతున్న చీమలు కనిపించాయి సుబ్బారావుకి".

మృత్యువు నాలుగు రకాలుగా తారస పడుతుంది. సహజ మరణం. అంటే ఆయువు మూడి ఏ రోగం వల్లో మరణించడం. ముసలి పాత్రలు సహజ కారణానికి గురవుతుంటాయి.

ఆకస్మిక మరణం రెండవది. పిడుగు పడో, కారు కింద పడో, ఫేక్టరీలలో మెషన్‌లో చిక్కుకొనో మృత్యువు వాత పడుతుంటాయి కొన్ని పాత్రలు. పాత్రలని బలవంతంగా నిష్క్రమింప చెయాలన్నప్పుడు ఈ రకం టెక్నిక్ వుపయోగించబడుతుంది. కారు, లారీల ఏక్సిడెంట్స్‌లో మరణించిన పాత్రల సంఖ్య ఎక్కువ మన తెలుగు కథలలో.

హత్య మూడవ తరగతికి చెందింది. ఇది కేవలం డిటెక్టివ్ కథలకే పరిమితంకాదు, సాంఘిక కథల్లో కూడా రాజకీయ పార్టీల కక్షల వల్ల హత్యలు చేయించడం, విలన్‌లు అబలలని రేప్ చేసి చంపటం మామూలే.

ఆఖరిది ఆత్మహత్య. ఇదో మంచి ఆయుధం రచయితకి. అకస్మాత్తుగా ఓ పాత్ర ఆత్మహత్యకి పాల్పడటం ద్వారా ఆ పాత్ర అంత దాకా అనుభవించిన మానసిక వేదనని రచయిత వ్యక్త పరుస్తాడు. ప్రేమ కథల్లో అయితే 'త్యాగం' ఆత్మహత్యలకి పురికొల్పుతుంది. దరిద్రం, అవమానం మొదలయినవి కూడా పాత్రలని ఆత్మహత్యలకి పురికొల్పు తుంటాయి.

పప్పులో వుప్పులాగా కథల్లో, నవలల్లో మృత్యువుని తూచి తూచి జాగ్రతగా కథకి బలం చేకూరే విధంగా అవసర మయిన చోట, సరయిన సమయాలలో, సక్రమ మయిన పద్ధతిలో వాడాలి. లేకపోతే కథ దెబ్బతింటుంది. రచయిత కావాలని మృత్యువుని కథలోకి లాక్కొచ్చాడని తెలిసిపోతుంది పాఠకులకి.

## గరిబీ హటావో . . . . . . అంట్యాకుల పైడీరాజు

గరిబీ హటావో
దునియాకు జగావో
గులామీ మిటావో
జగ, జగ, జగహై
దగా, దగా, దగా.

పొట్ట నిండ మెతుకులేని
చెట్ల క్రింద బ్రతుకులోయ్
కంటినిండ నిద్ర లేక
గట్ల మీద కునుకులోయ్
ముళ్లమీద నడకలు
బురదలోన పరుగులు
జగ, జగ, జగహై
దగా, దగా, దగా.

మోసగాళ్లుగ, బిచ్చగాళ్లుగ,
కులటలుగా మారినారు
రోగులుగా కుమిలినారు
ఆకలి రొద, మనుషుల సొద
తీరు నపుడు మారునోయ్
మలినమెల్ల తొలగునోయ్
మనిషి అపుడు మారునోయ్
జగ, జగ, జగహై
దగా, దగా, దగా.

గరీబీ హటావో
దునియాకో జగావో
జగావో, జగావో
జీవన్‌కో బఛావో.

# బహుమతులు పొందిన మూడు నవలలు

**చర్చావేదిక**

తెలుగు నవలా సాహిత్యంలో సమూలమైన మార్పును తేవడానికి తోడ్పడే ఉద్దేశంతో విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ (విజయవాడ) రెండేళ్లుగా నవలల పోటీ జరిపి, ఉత్తమమైన వాటికి బహుమతులు యిస్తున్నది కాలక్షేప సాహిత్యానికి భిన్నంగా వుంటూ, ప్రజా జీవితాన్ని, ప్రధానంగా కష్టజీవులైన శ్రామికుల జీవితాన్ని ప్రతిబింబించే విశిష్టతగల యీ నవలలను సమీక్షించేందుకు, ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం మద్రాసు శాఖ అధ్వర్యాన ఆగస్టు 6వ తేదీని పొట్టి శ్రీరాములు స్మారక మందిరంలో జరిగిన సమావేశంలో చదవబడిన సమీక్షా వ్యాసాలు, తరువాత జరిగిన చర్చ యీ పోటీ, దాని ఆశయమూ సఫల మయ్యాయని తెలిపాయి.

గత సంవత్సరం ఉత్తమ నవలలుగా నిర్ణయింప బడిన వాటిలో రెండు ('దేవుళ్ళారా మీ పేరేమిటి', 'కన్నీటికి నోరొచ్చింది') గ్రామ జీవితంలో పాతుకపోయివున్న ఫ్యూడల్ వ్యవస్థ మూలంగా జరిగిన ఘోర దురంతాలను చిత్రించగా, మూడోది ('వీళ్లూ మనుషులే') నగర మధ్య తరగతి ఎలా పతితమయ్యిందో చూపింది (ఈ నవలల గురించి జరిగిన చర్చను 'అభ్యుదయ' 1977 నవంబరు సంచిక ప్రచురించింది). ఈ సంవత్సరపు పోటీలో ఎన్నికయిన రెండు ('బలిపశువు'; రచయిత: జాతశ్రీ; వెల రూ. 5, 'కోటి కుటుంబాల ఘోష'; రచయిత: కె. బ్రహ్మానందరావు; వెల: రూ. 5.) గ్రామాల్లో ఫ్యూడల్ వ్యవస్థ విలయ తాండవాన్ని ప్రతిబింబించాయి. మూడవది ('సంకెళ్లు తెగుతాయి'; రచయిత: మల్లిక్; వెల: రూ. 5. ఈ ఆరు నవలల విక్రేతలు కూడా విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ వారే) బస్తీలో కార్ఖానా కార్మికుల కడగళ్లను, పోరాటాలను కథా వస్తువుగా తీసుకున్నది.

"క్రితం వలెనే ఈ యేడు కూడా విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ నవలల పోటీ నిర్వహించింది. అర్హమైన నవలేదీ రాక పోవటం చేత ప్రథమ బహుమతి నవల ఎంపిక చేయబడలేదీ సారి. నేటి సాహిత్యాన్ని ముఖ్యంగా మూడు రకాలుగా విభజించి చెప్పు కోవచ్చు. అభూత కల్పనలతో, మనసుకు గిలిగింతలు పెట్టే పాత్రలతో, సంఘటనలతో రంగు టద్దాల్లోంచి చూసి ఆహా జీవితం ఇలా వుంటే ఎంత బావుణ్ణు అనిపించేలా సృష్టించే సాహిత్యం ఒకరకం. పత్రికల పుణ్యమా అంటూ ఈ రకం నల్లమందు సాహిత్యం టన్నుల కొద్దీ సరఫరా అవుతోంది మనకీనాడు. వర్గ సమాజంలోని ఒక వర్గాన్ని మాత్రమే ప్రధానంగా తీసుకుని ఆ వర్గ జీవితాన్ని యధాతధంగా చిత్రించి మన ముందుంచటం రెండో రకం. అట్టడుగు జీవితాలను సానుభూతితో అవగాహన చేసుకుని సాహిత్యంలో ఆ వర్గానికో స్థానం కల్పించటం మూడో రకం. ఈ రకమైన రచనల్లో మళ్ళా రెండు రకాలు. పీడితుల జీవితాలని సామాజిక దృక్పథంతో పరిశీలించి, వారి సమస్యలకు పరిష్కారాన్ని సూచన ప్రాయంగా

నైనా తెలిపి వర్గ చైతన్యానికి తోడ్పడే రచనలు కొన్ని. వీటినే సామాజిక ప్రయోజనం గల రచనలుగా పేర్కొన వచ్చు. పరిష్కారాల జోలికి పోకుండా బడుగు జీవితాలని యధా తధంగా ఫోటోతీసి చూపించే రచనలు ఒక రకం. ఈ కోవకు చెందినవే 'బలిపశువు', 'కోటి కుటుంబాల ఘోష' అన్న నవలలు'' అని చెప్పి, శ్రీ. జి. సి. జీవి సంగ్రహంగా 'బలిపశువు' కధను వివరించారు.

''గ్రామాల్లో దొరలకింద పనిచేసే మాల వ్యవసాయకూలీల బ్రతుకు బానిస బ్రతుకు. ఒంట్లోని సత్తువనంతా దొరకు ధారపోస్తూ సమర్పించుకోవటమే కాదు, కట్టుకున్న పెళ్ళాన్నికూడా దొర కోరితే అప్పగించాలె కూలోడు. అలా చెయ్యకపోతే బతకడం ఆ పల్లెలో కష్ట మే మరి. కాళ్ళకు పసుపు పారాణీ చెరగక ముందే భార్య రంగమ్మను ఎల్లారెడ్డి దొరకు సమర్పించుకున్నాడు కూనయ్య. పేడాదిపాటు ఉపయోగించుకుని తన ద్వారా ఆమెకు కొడుకు పుట్టిం తరువాత దయ దల్చినట్టుగా మళ్ళా కూనయ్యకే వదిలేశాడు దొర ఆమెని. సంవత్సరం పాటు దొర బాహువుల్లో నలిగిన రంగమ్మకు మళ్ళా మొగుడితో కాపరం చేయటానికి మన సొప్పదు. దొరకి తప్ప మరెవ్వరికీ తన శరీరం మీద హక్కు లేదని భావించి, వేప చెట్టుకు వురేసుకుని పతివ్రతల జాబితాలో చేరి పోతుంది రంగమ్మ. దీనిలో తన మధ్య తరగతి మనస్తత్వాన్నుంచి కధకుడు బయట పడ లేకపోవటం కనిపిస్తుంది మనకు. ఈ నాడు చాలా మంది అభ్యుదయ రచయితలు చేస్తున్న పొరపాటే ఇది.

''పదేళ్ళు దాటిన రంగమ్మ కొడుకు చంద్రయ్య తనకి జన్మ నిచ్చిన దొర దగ్గరే జీతగాడుగా చేరతాడు. పెరిగి పెద్దవాడై దొరకు నమ్మిన బంటవుతాడు. పూనమ్మ నిచ్చి చంద్రయ్యని ఒక ఇంటి వాణ్ని చేస్తాడు దొర. దొర గారి వేరుశెనక్కాయల పంటని కాపాడే ప్రయత్నంలో వూళ్ళోని సాటి కూలోళ్ళకి పగవాడై ప్రాణాలు కోల్పోతాడు. 'కులోళ్ళ కోసం పోరాడినోడు దొరల సేతల మన్నై పోతాడు. అట్టనే దొర కోసం బతికే వోడు కూలోళ్ళ సేతల సావటం ఖాయం' అంటాడు రచయిత. వ్యవసాయ కూలీల సమస్యల్లో ఇక చెప్ప దగిన వేమి లేదులా వుంది రచయితకు. ఇద్దరు పిల్లలతో విధవరాలై యవ్వనంలో వున్న పూనమ్మని ప్రధాన సమస్యగా చిత్రించి కధ నడుస్తుంది. పూనమ్మ మీద ఊరి దొరల కళ్ళు పడటం, లొంగదీసుకునే ప్రయత్నంలో నిందలు మోపి పంచాయతీలు జరిపించి ఆమె మీద పగ తీర్చు కోవటం మొదలైన గొడవలతో తక్కిన కధ నడుస్తుంది. పూనమ్మ కొడుకూ, కూతురూ పెద్ద వాళ్ళవుతారు. అంత వరకు ఎంతో ఆదరం చూపిన ఎల్లారెడ్డి, కోడలు వంటి పూనమ్మ మీద మోజుపడి ఆమెని భయపెట్టి లొంగ దీసు కుంటాడు. తల్లి చెడిపోవటాన్ని కళ్ళారా చూసిన కొడుకు ఆమె నసహ్యించు కుంటాడు. పూనమ్మ కూతురు ముత్తేలు కందిచేలో బలాత్కరింప బడి పిచ్చి చూపుల్తో ఇంటికి రావటం, ఆమెకు దెయ్యం పట్టిందని దెయ్యాల సోములు చేత అమానుషంగా బాధించటం పూరి ప్రజల మూఢ నమ్మకాలకి ముత్తేలమ్మ బలై

పోవటం, చెల్లెలి శవాన్ని చూసిన కొడుకు అడవుల్లో కెళ్ళి అన్నల్లో కల్సి పోవటం మొదలైన సంఘటనలన్నీ నవల్లోని పిట్ట కథల్లా అనిపిస్తాయే గాని పాఠకుణ్ణి కదిలించేటంత బలంగా లేవు. ప్రయత్నిస్తే ఈ రచయిత ఇంత కన్న మంచి నవలలు రాయ గలడని మాత్రం అనిపిస్తుంది.

"కోటి కుటుంబాల ఘోష" వ్యవసాయ కూలీల దుర్భర జీవితాన్ని యథాతథంగా ఫోటో తీసిచూపించి వదిలేసిన నవల. ఇందులో నూటికి నూరు పాళ్ళు వాస్తవికత వుంది. సహజత్వం వుంది. ఈ నవల అందమైన పల్లె పడుచులు, ప్రేమలు పెళ్ళిళ్లు కనిపించవు. రచయితలో సిన్సియారిటీ పుష్కలంగా వుందిగాని 'ఆర్టు' లోపించిందేమో ననిపిస్తుంది నవల పూర్తి చేసింతరువాత. సాహిత్యం జీవితం వలె ఉండాలేగాని జీవితమే సాహిత్యం కాకూడదు. ఒక దృశ్యాన్ని ఫోటో తియ్యడానికి, దాన్నే కళాత్మకమైన చిత్రంగా మలచడానికీ ఎంతో తేడా వుంటుంది. జీవితాన్ని కళాపరమైన అనుభూతితో పరిశీలించి సాహిత్యంలో చూపించాలే గాని కేవలం యధాతథంగా చిత్రించి వదిలేస్తే సరిపోదు.

"కూలి రేట్లను పెంచమని కోరితే హరిజన వ్యవసాయ కూలీల గుడిసెల్ని నుసి చేసే భూ భామందులు పల్లె పల్లెకూ వున్న పుణ్యభూమి మనది. హరిజనుల్ని సజీవ దహనాలు చేస్తున్నా కిమ్మనకుండా వుండే ప్రభుత్వం మనది."

శ్రీ ఆర్. నారాయణరావు 'బలి పశువు' ను సమీక్షిస్తూ, పల్లె పడతుల నిస్సహాయ జీవితాన్ని వెలికి తేవడంలో, దాని రచయిత చాలవరకూ కృతకృత్యులయ్యారనీ, "మారుమూల పల్లెలోని యమకూపాన్ని ప్రత్యేకంగా ఎత్తి చూపార" నీ చెప్పి, ఎల్లారెడ్డి పూనమ్మ గర్భవతి అయిన తరవాత "కూనిగా నిన్ను సూత్తాంటే నాకు మా యిదిగ వుందిరా ... పోరా నా పేరు చెప్పు కొని నీ పెళ్లాన్ని నువ్వే ఏలుకోరా ... దాన్తోలికి నే(న)నాసులే అని అనడం ఎంతవరకు సహజంగా వుందని సందేహం వెలిబుచ్చారు. పల్లె జీవితాన్ని ప్రతి బింబించిన యీ నవలను ప్రతి ఒక్కరూ చదవాలన్నారు.

శ్రీ మహీధర రామమోహనరావు 'బలి పశువు' "రచన పద్ధతి బాగుంది. కొన్ని చోట్ల Poetic touches వున్నాయి, నిగ్రహం వుంది" అని చెప్పి, కథా 'వస్తువు' కేవలం సెక్సు సమస్య మీదే వుండడం, దొరల దోపిడి యావత్తు సెక్సుకే ముడిపడి వున్నట్లూ, పల్లె జనుల మధ్య సంబంధాలకు అదే సూత్రమైనట్లూ, చిత్రించడం అసలు సమస్యను విస్మరించడమవు" తుందన్నారు; "మాల పల్లె పరిస్థితిని మధ్య తరగతి రైతు దృక్కోణంనుంచి చిత్రించారేమో" నన్న అనుమానం వెలబుచ్చారు.

శ్రీ పొంగ్రడింకి సుబ్రమణి "శ్రమ జీవుల బాధలనుండి కావ్య సుధలను చిలికించే గాధలను సృష్టించిన మహానుభావులలో గోర్కీ అగ్రగణ్యుడు .... గోర్కీ కేవలం చూచి, ఆ తరవాత ఆలోచించి వ్రాయలేదు. శ్రమజీవుల మధ్య నుండి, శ్రమ జీవితాన్ని అనుభవించి ఆ తరవాతనే ఆయన రచయిత అయ్యాడు" అని చెప్పి, సంకెళ్ళు తెగుతాయి, "శ్రమ జీవుల సాధక బాధకాలను, పీడిత తాడితుల నికృష్ట జీవితాలను వర్ణించే ఒక రచన" అనీ,

ఋుందులోని పాత్రలు జ్ఞాపకం వుంచుకో దగ్గవనీ అన్నారు.

కథ పారిశ్రామిక వాడలలోని చిన్న చిన్న వర్క్‌షాపుల వాతావరణాన్ని సృష్టిస్తుంది. ఆ కార్మికుల కష్టాలూ, బాధలూ చెపుతుంది. పరోపకారి, స్నేహ పాత్రుడు అయిన సంతోష్ కథానాయకుడయినా, ఆ పాత్రకు సరి సమానమైన ముఖ్య పాత్రలు లేకపోలేదు. వృద్ధుడు, రోగి, తాగుబోతు అయిన జాలయ్య చావు గురించి చెప్పుతూ రచయిత, "ఆ బస్తీలో చావులు మామూలే, జబ్బులు వాళ్ల శరీరాల్లో, ఇళ్లల్లో కాపురం చేస్తుంటాయి. చావు కూడా పాకల ముంగిట్లోనే నిఘా వేసినట్లే వుంటుంది" అని వివరిస్తాడు. ఈ నవల ఆసక్తిదాయకంగా సాగేందుకు కారణం – ఆ వర్క్‌షాపులో పనిచేసే కార్మికులు, కార్మిక నాయకత్వంలో ఏమంత అనుభవం లేని సంతోష్ ఆధ్వర్యంలో సాగే సమ్మె. కార్మిక సంఘాలులేని చిన్నచిన్న కర్మాగారాల్లో కష్ట జీవుల శ్రమను వ్యాపారులు ఏ విధంగా దోచుకుంటున్నదీ చక్కగా చిత్రించాడు. కాని రచయిత ఆవేశపరుడైనందువల్ల ధనవంతులను దూషించే లెక్చర్లు ఎక్కువగా వున్నాయనీ, పాఠకులు నవలను కథ కోసమే చదువుతారనీ వక్త చెప్పారు.

శ్రీ వై. వి. ఎస్. ఎస్. ఎన్. మూర్తి కూడా యీ నవలనే సమీక్షిస్తూ, యిరవై ఏళ్ల క్రితం సాదా కార్మికుడుగ జీవితం ప్రారంభించి యింజినీరింగ్ వర్క్ షాపు యజమాని అయిన జనార్ధనం "తోటి కార్మికులను దోచుకొని ఎదిగిపోయాడు" అని వివరించారు. పని నేర్చుకోడానికి వచ్చిన ట్రైనీల గురించి, "వీళ్లందరికీ, జీతా లెక్కడిస్తాం? నేర్చు కోడానికి వచ్చి నోరు మూసుకుని పని చేసేవాళ్లు లక్షలు లక్షలున్నారు" అని జనార్ధనం జబాబు. సమ్మె మొదలయ్యాక జనార్ధనం పోలీసుల్ని తెచ్చేడు. న్యాయమైన కోర్కెలను తీర్చమన్న వారిని పోలీసులు బాదుతూ తీసుకుపోయారు. కార్మికుణ్ని బంధించే సంకెళ్లు – అజ్ఞానం, భయం, అనారోగ్యం, నిరుద్యోగం, దారిద్ర్యం, నోరు లేకపోవడం. కార్మిక శక్తిని బంధించిన సంకెళ్లు తెగుతాయి అన్న విశ్వాసాన్ని రచయిత వ్యక్తం చేశారు. తను చెప్పదలుచుకున్న విషయాన్ని సూటిగా చెప్పడంలో రచయిత కృతకృత్యుడయ్యారనీ, "నల్లమందు సాహిత్యం వెలువడుతున్న యీ రోజుల్లో యిటువంటి నవల అవసరం ఎంతయినా వుంద"నీ వక్త అన్నారు.

ప్రసంగం ముగిసిన తరవాత జరిగిన చర్చలో, 'సంకెళ్లు తెగుతాయి' లో సమ్మెకు పరిష్కారం కనిపించలేదనీ, రచయితకు సరైన అవగాహన వున్నట్టుగా కనిపించలేదనీ, సమ్మె ద్వారా విప్లవం వస్తుందేమోనన్న భావం ఆయనకుందేమోననీ శ్రీ జి. సి. జీవి అన్నారు.

సమ్మెలే విప్లవం కాదనీ; కార్మిక వర్గం, యితర శ్రామిక శక్తులూ సంఘటితం కానిదే విప్లవం సఫలం కాదనీ చెప్పి, ప్రస్తుతం కార్మిక వర్గంలో వున్న బలహీనతలను శ్రీ టి. ఎల్. నరసింహారావు, సెట్టి ఈశ్వరరావు వివరించారు. సమీక్షించిన నవలలు, యిప్పటి నవలా రచన తీరుకు భిన్నమైనవి; సమాజ పురోగతికి తోడ్పడేవి; వాటిని ఆ దృష్టితో చూడడం అవసరం; మనకు అందుబాటులేని ప్రమాణాలను ఆశించడం అత్యాశ అవుతుందని శ్రీ ఈశ్వరరావు చెప్పారు.

# మనసును మలినం చేసే మన సినిమాలు

ఒక ప్రేక్షకుడు

తెలుగు సినీ పరిశ్రమ మంచి చెడ్డల గురించి తరచు పత్రికల్లో తర్జన భర్జనలు చేసే బాధ్యత గల ఒక వ్యాఖ్యాత తెలిపిన సంఖ్యా వివరాల ప్రకారం, ఆంధ్ర ప్రదేశ్‌లోని 1475 సినిమా థియేటర్లలో ఏడాదికి 50 కోట్ల మంది సినిమాలు చూస్తున్నారు. అంటే రాష్ట్రంలోని నాలుగున్నర కోట్ల జనాభా సగటున తలసరిని నెలకో సినిమా చూస్తున్నదన్న మాట. రేడియోలు గాని, నాటకాలు గాని, మరింకే సాధనం గాని సినిమా అంతగా ప్రజలలోకి చొచ్చుకొని పోయి, ప్రజల మనస్సుల మీద తన ముద్రను వెయ్యడం లేదని చెప్పడానికి సందేహించ నక్కర్లేదు.

ఇంతటి బలవత్తర సాధనమైన, యింతగా సర్వవ్యాప్తమైన సినిమా తెలుగు ప్రేక్షకుల మానసికారోగ్యానికి మేలు చేయడం లేదనీ, కళా ప్రమాణాలను బట్టి చూసినా తెలుగు ఫిల్ములు, యితర భాషల్లో వాటితో పోల్చి చూస్తే అట్టడుగు మెట్టున వున్నాయనీ బాధ్యత ఎరిగిన కొంత మందయినా చాలా కాలంగా గోల పెడుతున్నారు. కాని ఫలితం బహుస్వల్పం.

కళా ప్రమాణాలు, ఉన్నతమైన అభిరుచులు వున్న సినిమాలను ప్రదర్శించే ఫిల్మ్ సొసైటీలు వివిధ నగరాలలో నలభై వరకు వున్నాయి. పైని పేర్కొన్న వ్యాఖ్యాత చెప్పిన దాని ప్రకారం, వీటిని చూసే వాళ్లు ఏడాదికి ఏడున్నర లక్షలు మాత్రం. మొత్తం ఏభై కోట్ల మంది ప్రేక్షకులలో, వీరు సముద్రంలో నీటిబొట్టు కంటె మించరు.

తెలుగు సినీ పరిశ్రమలో అన్నిటి కంటె ప్రబలంగా వున్న ధోరణి, తక్కువరకపు సరదాలు, ఉబలాటాలూ తీర్చే సినిమాలు తీసి, దండిగా డబ్బు నొల్లుకో వచ్చునన్న నమ్మకం. ఈ నమ్మకం సినిమాలు తీసే వారిని పెనుభూతంలాగా పట్టుకుంది. ఒకటో అరో తప్పితే తీసేవన్నీ యీ బాపతువే కావడం వల్ల, యీ పెనుభూతం పీడ చూసేవారు కూడా అనుభవించక తప్పడం లేదు — నల్లమందుకో, నాటుసారాకో అలవాటు పడిన వాళ్లకు జరిగినట్టు.

వ్రతం చెడినా, ఫలం దక్కుతుందా అంటే, తొంభై శాతం మంది నిర్మాతలు పెట్టిన పెట్టుబడులు నష్టపోతున్నారు. ఇక లాభాలు సంపాదించిన వాళ్లు, కొద్ది వేళ్ల లెక్కకు మాత్రం వస్తారు. ఇది వాళ్ల సుడి మహత్యమే గాని, ప్రయోజకత్వం ఏమీ కాదు.

అరుదుగా జరిగే యిటువంటి ఘటన యిటీవల దిగ్విజయం సాధించిన "రామ కృష్ణులు" విషయంలో సంభవించింది. తారాగణం, తదితర విషయాల్లో యిది భారీ ఎత్తు చిత్రం. ఐదు వారాల్లో దాదాపు 43 లక్షల రూపాయల విలువ చేసే టిక్కెట్లు అమ్ముడయ్యాయని చాలా దర్పంగా పత్రికల్లో అడ్వర్‌టైజ్‌మెంట్లు వేశారు!

బాక్సాఫీస్‌ను బద్దలు కొట్టిన యీ బ్రహ్మాండమైన చిత్రంలో మెచ్చుకో వలసిన విశేషమేమైనా వుందా? నిర్మాతలు తామే ఢంకా మీద దెబ్బ కొట్టి చెప్పుకున్నట్టు, ఐదు వారాల్లో 43 లక్షలు గడించి పెట్టిన యీ చిత్రం ప్రేక్షకుల మీద చల్లిన మత్తుమందు, వాళ్ల మనస్సులకు మేలు చేసేదేనా?

వెకిలి హాస్యం, నమ్మశక్యం కాని స్టంటులు, అర్ధనగ్నంగా వున్న అమ్మాయితో పాటు దుప్పటి కింద జరిపించిన సరసం, చివరికి యిద్దరి మొగవాళ్ల సెక్స్ సరసం కూడా దీని ప్రత్యేకాకర్షణలు!

కథానాయక ద్వయం తోడు దొంగలు. చాలా వుషారుగా, చలాకీగా మహారాజుల్లా బతుకు తుంటారు. కొట్టు కొచ్చిన డబ్బు ధర్మ కార్యాల కిస్తుంటారు. ఇందుకు తగ్గవాళ్ళే హీరోయిన్లు దొరకుతారు. పరమ గందర గోళంగా ప్రేమ సాగిపోతూ వుంటుంది. మధ్యలో విలన్‌తో రకారకాల స్టంటు యుద్ధాలు జరుగుతూ వుంటాయి. చివరికి విలన్నీ, వాడి ముఠాని హతమార్చి తమకు అన్ని విధాలా సరిపోయిన ఆ అమ్మాయిల్ని పెళ్ళాడేస్తారు హీరోలు.

కథాగమనం ముచ్చటంతా చేతల్లోనూ, మాటల్లోనూ మాత్రమే కాదు! అది పాటల్లోనూ పొర్లుతూ వచ్చింది.

కన్నె ఎవరో - కానిదెవరో
ఎలా చెప్పేదీ - . . .
రంగు చూశా పొంగు చూశా
చంగు చంగు నడక చూశా . . .
దేన్ని చూసీ - దేంతో తూచీ . . .

కన్నె ఎవరో కానిదెవరో నిర్ణయించి చెప్పడానికి జరిగిన పోటీ సందర్భంగా యీ పాట ప్రేక్షకుల్ని ఉబ్బితబ్బిబ్బు చేస్తుంది. ఇది బ్లూఫిల్ము కాదు గాబట్టి, కథా నాయకు లిద్దరూ ఎక్స్‌రే కళ్లతో జయప్రదంగా ఆ నిర్ణయం చేసేస్తారు. ఇంకో పాట -

కవకవలాడే చిన్నవాడా
కవటాకల్లే ఉన్నవాడా
చూపులతోనే చూలొచ్చేస్తే
పుట్టేవాడికి నాన్నవుతావా
వాడమ్మకి మొగుడవుతావా . . .

ఇటువంటి చిత్రం తీసి లక్షలు సంపాదించిన నిర్మాతలు; లక్షలు పుచ్చుకున్న అభిమాన తారలు; తతిమ్మా సినీ ఫండి; హీనమైన అభిరుచులను నేర్పినందుకు కొల్లలుగా ధనాన్ని కుమ్మరించిన ప్రేక్షకలోకం; సత్ప్రయోజనం దృష్టిలో పెట్టుకొని నిర్మించే చిత్రాలను ఆదరించక, ప్రజలను తప్పుతోవ పట్టించి కొల్లగొట్టుకోడానికి తలపడేవారి పోషణకు పూనుకున్న ప్రభుత్వం - కటువుగా వుండవచ్చునేమో గాని - యీ అవాంఛనీయ పరిస్థితిని మార్పు చేసే ఆలోచనలు మొదలు పెట్టాలి, 'రామకృష్ణులు' వంటి ఫిల్ము వచ్చిన తరువాతనైనా.

## చిరునామా మార్పు

'అభ్యుదయ'కు సంబంధించిన ఉత్తరాలు, పంపే రచనలు; మని ఆర్డర్లు, డ్రాపులు, చెక్కులు మొదలైనవి యీ దిగువ చిరునామాకు పంపవలసిందిగా విజ్ఞప్తి.

ABHYUDAYA,
R - 3, Llyods Estate,
Madras – 600 014

## సమీక్ష

### కవిసేన మేనిఫెస్టో

(శేషేంద్ర రచన, ఇండియన్ లాంగ్వేజెస్ ఫోరం ప్రచురణ, జ్ఞాన్ బాగ్ ప్యాలెస్, గోషా మహల్, హైదరాబాద్. వెం: రూ. 10.)

ఆధునిక కావ్య శాస్త్రంగా ప్రకటింపబడిన, 360 పుటలకు పైగా వున్న యీ పుస్తకం ఒక వైజ్ఞానికోద్యమాన్ని ప్రారంభించే ఉద్దేశంతో ప్రచురింపబడింది. ఇది యీ మేనిఫెస్టో మొదటి భాగం. దీని హిందీ తర్జుమా త్వరలో రానున్నది. కవిసేన కవితా సంకలనాలు ప్రతి సంవత్సరం వెలువడుతుంటాయనీ, రానున్న రెండో భాగంలో సాహిత్య విమర్శ, కథ, నవల, నాటకం మొదలైన ప్రకరణాలుంటాయనీ ఆంధ్రప్రదేశ్ కవిసేన అధ్యక్షుడు (?) తెలియజేస్తున్నారు.

దీన్ని సిద్ధపరచడానికి ఉపయోగించిన అలంకార శాస్త్ర (సంస్కృత) గ్రంథాల, మార్క్సిస్టు శాస్త్రగ్రంథాల, ప్రాచీన, ఆధునిక పాశ్చాత్య శాస్త్ర గ్రంథాల పెద్ద పట్టిక; (యీ పట్టికలో దీని రచయిత గ్రంథాల పట్టిక కూడా ఉంది); వివిధ ప్రకరణాల శీర్షికలు; తెలుగు దేశంలో నూతనంగా కవిత్వ బోధ అభివ్యాప్తం చెయ్యడానికి ప్రయత్నించే ఆధునిక కావ్య శాస్త్ర గ్రంథంగా చెప్పబడిన ప్రకటన ఎంత గట్టి సంకల్పంతో యీ ఉద్యమం తలపెట్టబడుతూ వున్నదో తెలుపుతాయి. ఇది హిందీలోకి తర్జుమా జరుగుతూ వుండడాన్ని బట్టి, దీని ఎల్లలు తెలుగు దేశానికి మాత్రం పరిమితమైనవి కావని తెలుసుకోవచ్చును. అయితే యింతటి పెద్ద పూనికకు వెనుకనున్న వ్యక్తులు ఎవరో, శక్తులు ఏవో యీ మేనిఫెస్టో తెలియజెయ్యడం లేదు. రచించింది ఫలానా, గ్రంథ విక్రయ ధనం విరాళంగా యిచ్చింది ఫలానా అని మాత్రం ప్రకటించడం జరిగింది. "మన మందరం కలిసి ఒక దిక్కుకు నడుద్దాం" అన్న శీర్షికతో వున్న పీఠిక గుంటూరు శేషేంద్ర శర్మగారిది. దానికి ముందర 'అధ్యక్ష వచనం' అన్న దొకటుంది గాని, ఆ అధ్యక్షుడి పేరు పాఠకుడి ఊహకు విడిచిపెట్టడం జరిగింది. శేషేంద్ర శర్మగారి 'గొర్రిల్లా' లోని "నీవు పెరిగి పెద్దవాడి వయితే ఈ మిద్దెలు, మేడలు, అసెంబ్లీలు, అకాడమీలు నీ నడుం ఎత్తుక్కూడా రాలేవు" అన్న సూక్తి యీ ఏక పాత్రాభినయాన్ని సమాప్తం చేస్తున్నది.

ఈ 'మేనిఫెస్టో' లో పది శీర్షికలు, ఎన్నో ఉపశీర్షికలూ వున్నాయి. అంతటా పాండిత్య ప్రదర్శన, ఆవేశంతో స్వీయ సిద్ధాంతాల ప్రతిపాదన, దూషణలు దండిగా కనిపిస్తాయి. ఒకచోట (పుట 195) "మనిషి దేనికయినా కమిటెడ్ కావడం చాలా గొప్ప విషయ" మని మెచ్చుకుంటూనే, "నేను కమిటెడ్ కవినని చెప్పుకోవడం కొందరు చాలా గొప్ప అనుకుంటారు. ఆ చెప్పే పోజు చూచి కొందరు — కొందరే – చవటలకు నిజంగా చాలా గొప్ప పని చేశాడు ఈ బాల మహాకవి అని మూర్ఛ పడిపోయే పర్యంతం అవుతుంది. కాని వాడి కమిటెడ్, వాడి పోజు వరకే లిమిటెడ్. ఇవి చిన్నచిన్న పాకెట్లలాంటి వర్గాలు, ప్రజా సమూహాలతో నిమిత్తం లేనివి; కాలపు మహాసౌధం క్రింద నలిగిపోయే ఛోటా

ముతాలు'' అని శేషేంద్ర శర్మగారు తీర్పుచెప్పారు. ఆ 'పోజు' పెట్టేవాళ్లకు, వాళ్లను చూసి మెచ్చుకునే 'కొందరే కొందరు చవటలకు' 'ప్రజాసమూహాలలో నిమిత్తం' లేదని నొక్కి వక్కాణించారు గాని, తన కవిసేన ఉద్యమంలోని 'ప్రజా సమూహాలు' ఏక వచనం మాత్రమేనన్న సత్యాన్ని ఆయన విస్మరించారు.

## శతావతారాలు

రచన, ముక్కామల నాగభూషణం. వెల : రూ. 3-50. ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, 520 004.

రామాయణ, భారత కథలు వివిధ ప్రాంతాలలోనూ, వివిధ దేశాలలోనూ ఏఏ రూపాలలో, ఏఏ కారణాల వల్ల ఆ రూపాలు పొందినదీ వివరించిన పుస్తకం యిది. అందుచేతనే 'శతావతారాలు' అని దీనికి నామకరణం జరిగింది. సాధికారంగా చెప్పగల పలువురు పండితుల అభిప్రాయాలు ఆయా విషయాల పైన ఉటంకించబడ్డాయి.

మానవ పరిణామంలో జీవితం, ఆచారాలు, సంఘ స్థితిగతులు, పొందిన మార్పులు ఆది కావ్యాలుగా వున్న రామాయణ, భారతాలలో ఎలా ప్రతిబింబించిందీ యీ పుస్తకం వివరించింది. ఇతర దేశాలలోని రామాయణ, భారత కావ్యాలతో యీ కావ్యాలకున్న పోలికలు కూడా యీ పుస్తకం తెలుపుతుంది.

"రామయాణ, భారత గాథలు రెండూ శతావతారాలు ఎత్తినప్పటికీ, వాటిని చారిత్రక దృష్టిలో పరిశీలించాలి. ఎందుకూ పనికిరాని గ్రంథాలనో, ప్రజల మనసులపై మత్తు మందు చల్లి, మూఢనమ్మకాలను పెంచే గ్రంథాలనో వాటిని త్రోసిపుచ్చనూ కూడదు'' అన్న వాక్యాలతో యీ గ్రంథం ముగుస్తుంది. ఆసక్తితో చదివించే పుస్తకం.

## సౌజన్య సాహితి

వివిధ రచయిత(త్రు)ల కథలు. సంకలన కర్త ఎం. డి. సౌజన్య. వెల : 8. ప్రతులకు, యం. డి. నఫీజుద్దీన్, లెక్చరర్, నాజరుపేట, తెనాలి.

ఇరవై కథలున్న యీ సంపుటంలో రచనోత్సాహం, చెడుగుల్ని విమర్శించాలన్న కుతూహలం కనిపించినంతగా కథాకథనంలో పటుత్వం కనిపించదు. సంకలనకర్త 'నేరమూ - శిక్షా ?' అన్న కథలో పరీక్ష పేపర్లు దిద్దడంలో జరుగుతోన్న నిర్లక్ష్య వైఖరి, అవినీతి వెల్లడించబడింది. దానికి శిక్షగా ఒక పాత్ర కొడుకు చావుతో కథ ముగుస్తుంది. ఈ కథ నీతిని ప్రబోధించింది గాని, అది నేర్పుగా జరగలేదు. 'ఎమర్జెన్సీలో అప్పారావు' వంటి వెకిలికథలూ, 'ఆడ రచయితలు' వంటి పేలవ రచనలూ, రచనా శిల్పాన్ని రచయితలు మెరుగు పర్చుకోవలసిన అవసరం ఎంతో వుందని తెలుపుతాయి.

> సమీక్షకోసం పుస్తకాలు పంపేవారు, రెండేసి ప్రతులు పంపాలి (సం).

నవల జీవితానికి సరిగ్గా సరిపడుతుందా అని చూడడానికి అదే జీవితానికి నకలు కాదు. జీవితంలో ఒక భాగానికో, ఒక అంశానికో అది కృత్రిమ సులభ రూపకల్పన మాత్రమే. ఆ రూపకల్పనలోనే దాని విజయమో, వైఫల్యమో

## లేఖలు

### తెలుగు భాషలో ఇంగ్లీషు శబ్దాలు

ఆధునిక రవాణా మార్గాలు, ప్రసార సాధనాలు దేశాల్ని ఎలా దగ్గరకు చేరుస్తున్నాయో, అలాగే అధునిక విజ్ఞానం భాషల్ని సన్నిహితం చేస్తోంది; ఐక్యం చేస్తోంది. ఈనాడు మనం మాట్లాడుకొనే తెలుగు భాష అనేక భాషల సమ్మిశ్రణం (ఉదా: సంస్కృతం, అచ్చతెనుగు, పార్సీ, ఇంగ్లీషు వగైరా). అయితే, యీ సమ్మిశ్రణం ప్రజా బాహుళ్యపు గుర్తింపు పొందినదై యుంటుంది. పై వర్గమో, మధ్య వర్గమో ఆమోదించినంత మాత్రాన సరిపోదు. అంత వరకు దేశభాషలకూ, పరాయి భాషలకూ మధ్య సంపర్కమూ ఉంటుంది, సంఘర్షణా ఉంటుంది. ఎవరినైతే ఉద్దేశించి మన ప్రసంగం, లేదా రచన, లేదా ప్రసారం చేయబడుతుందో, వారిలో అధిక సంఖ్యాకులు దాన్ని చక్కగాను, సమగ్రంగాను అర్థం చేసుకొనేటట్లుండాలని మనం వాంఛిస్తాం.

ఈ కొలబద్ద సరియైనదేనని పాఠకు లంగీకరిస్తే, నేడు కొన్ని పత్రికల్లో భాషల సమ్మిశ్రణ సహజంగా కాక, కృత్రిమంగా సాగుతోందని అనిపిస్తుంది. రెండో భాషతో బాగా పరిచయం ఉన్నవారికే అర్థం అయేటట్టు కొన్ని శబ్దప్రయోగాలుంటున్నాయి. ఇది వాంఛనీయమైన పరిణామం కాదు. కొన్ని శబ్దాలు పరాయి భాషలో ఉంటేనే చక్కగా అర్థమవుతాయి (ఉదా: రైలు, రేడియో, సైన్స్, బుక్కు, బ్లేడు వగైరా). వీటికి ప్రత్యామ్నాయాలు వెతకడం వృథా ప్రయాస. అది నిరుపయోగమే కాక, భాష అభివృద్ధిని కూడా అరికడుతుంది. కాని, జనసామాన్యానికి చక్కగా అర్థమయే శబ్దాలు దేశభాషలో ఉన్నప్పుడు, వాటినే ఉపయోగించడం విజ్ఞుల ధర్మం.

1978 జులై "అభ్యుదయ" లో కొన్ని ప్రయోగాలు ఇంగ్లీషుతో పరిచయం ఉన్నవారికి తప్ప, మిగతా వారికి అర్థం కానట్లు ఉన్నాయి. వాటికి చక్కని తెలుగు ప్రత్యామ్నాయాలు సులభంగా దొరుకుతాయి. పట్టణ నాగరికతకు బాగా అలవాటు పడ్డవారికి గాని ఆ యింగ్లీషు ప్రయోగాలు అర్థంకావని నా అభిప్రాయం. మరి కొన్ని ఇంగ్లీషు శబ్దాలు (ఇలాంటివి బహుకొద్దే ననుకొండి) ఇంగ్లీషుతో బాగా పరిచయం ఉన్న వారికి కూడా అర్థం కావు. ఉదా: "లంపెన్ ప్రోలిటేరీయట్."

"రొటీన్ థీమ్స్," "వెరైటీ," "సైకాలజీ" (పుట 11); "మంచి ప్లాటు," "ఆర్టికల్" (పుట 12); "వెకేషనరీ టైము," "లెస్ లగేజి మోర్ కంఫర్ట్," "బేస్కట్టు" (పుట 18); "టూ టైర్‌లో రిజర్వేషన్," "విజిలు అయిపోయాక," "పెనాల్టీ," "కాన్సిల్ చేయబడి ఎన్‌కాష్ చేయబడ్డాయని" (పుట 19); "లాజిక్కు," "కేసు బిల్డ్ చేశారు" (పుట 22); "సాహిత్య లంపెన్ ప్రోలిటేరియట్లు" (పుట 25); "బ్లాక్ అవ్‌ట్" (పుట 32); "ఆస్పత్రి స్కెలిటన్ స్టాప్‌తో నడుస్తుంది" (పుట 33); "పొలిటికల్ గ్రైన్స్," "హిపాక్రాట్స్" (పుట 34); "స్కెలిటన్ సర్వీస్," "ఆక్సిజన్," "మేజర్ టెస్టులూ, ట్రీట్‌మెంటూ" (పుట 35); "ఆర్గ్యుమెంటు" (పుట 36), "ట్రైబల్ ట్రాజెడి" (పుట 46). వీటికి తెలుగు ప్రత్యామ్నాయాలు వెతుక్కోవడం కష్టం కావు; కొన్నిటి విషయంలో కష్టం ఉన్నా, అనుభవించాలి తప్పదు. ఇతరుల తోడ్పాటుతో సులభం అవుతుంది.

"లగేజి," "ప్రైమ్మినిస్టర్," "సింగిల్ గాణ్ణి" (పుట 18); "పెన్ను," "గన్ను" (పుట 21); "పేషెంట్లు" (పుట 33); "బెడ్" (పుట 34); యిత్యాది శబ్దాలు సులభంగా అర్థమయేవే; కాని వాటికి తెలుగు ప్రత్యామ్నాయాలు సులభంగానే దొరుకుతాయి.

గురజాడ అప్పారావు గారు గిరీశంచేత అనేక యింగ్లీషు పదాలను దొర్లింపజేసిన విషయం నిజమే. కాని, అవి కొన్ని ప్రత్యేక సందర్భాల్లో, ఒక ప్రత్యేక ప్రయోజనం కొరకు ఉపయోగింప బడినవి. పైన పేర్కొన్న శబ్దాలూ, శబ్ద ప్రయోగాలూ ఆ తరగతి క్రిందికి రావు. వాటిని ఉపయోగించడంలో రచయితల ఉద్దేశమేమిటో తెలియదు.

భావాల్నే కాక, భాషను కూడా ఆధునీకరించడం "అభ్యుదయ" పత్రిక కర్తవ్యం. నిజమే. కాని, సాధ్యమైనంత ఎక్కువ మంది పాఠకుల చేత "అభ్యుదయ" ను చదివించ

దలచుకొంటు, భాషల సమ్మిశ్రణను కొంత నెమ్మదిగాను, విచక్షణతోను ప్రవేశ పెట్టవలసి వుంటుందనుకొంటా. "ఓవర్ బ్రిడ్జి," "సిగ్నలు దీపాలు," "లాడ్జి", "సీటు," "టికెట్స్ ఎగ్జామినర్" వంటి ప్రయోగాలకు నాకు అక్షేపణ లేదు. పాఠకులు నెమ్మదిగా యిట్టి వాటికి అలవాటు పడుతున్నారు.

ప్రతి పౌరుడు తన దేశాన్ని ప్రేమించడ మెంత సహజమో, తస భాషను కూడా ప్రేమించడం అంత సహజం. అలాగని, దేశ దురాభిమానాన్ని మనం హర్షించం! భాషా దురభిమానాన్ని గర్హిస్తాం. తన భాష మీద తాను అధికారం సంపాదించడానికి కృషిచేస్తూ, యితర భాషల్ని స్నేహ హస్తంతో ఆహ్వానించడం, పలుభాషల్ని తన భాషలో విలీనం చేసుకోడానికి ప్రయత్నించడం, ఆ విధంగా జన బాహుళ్యాన్ని పురోగామి పథంలో నడిపించడం సాహిత్యకారుల కర్తవ్యంగా ఉండాలని నా అభిప్రాయం.

కం. సత్యనారాయణ హైదరాబాద్

## అయోమయ గద్య కవిత్వం

అగస్టు నెల 'అభ్యుదయ' లోని 'ఆముదపు చెట్లు' లో గడ 'కాలం వీలునామా'లో లాగా అయోమయ గద్యకవిత్వం. వీటిని రాసిన మిరియాల రామకృష్ణ, సోమసుందర్ గార్లు, అంతు కనిపించిన చోట్ల సదుద్దేశాలనే ప్రకటించినట్టున్నారు, కాని ఆ సదుద్దేశాలను తేలిక మాటలలో (వారికిది అసాధ్యమనుకోను) తెలిపితే, వారి కవితా మాధుర్యాన్ని ఎక్కువ మంది రుచిచూసి వుండేవారు కదా మరి. ఎక్కువ చదువుకోని పాఠకులు బెదిరిపోయే ట్టుగా రాయాలా, - అదీ వచన కవిత్వాన్ని? మన కవులు సామాన్య పాఠకుల కష్టాన్ని, రవ్వంత గమనించి నట్టయితే, ఆ సామాన్య పాఠకులకే కాకుండా, కవిత్వానికీ, అది రాస్తున్న తమకూ మేలుచేసిన వారవుతారు.

కె. వెంకటేశ్వరరావు విజయవాడ

## 'ఛాందసుడు', 'అస్సాల్ట్ అండ్ రేప్'

ఈ మధ్య 'అభ్యుదయ' లో ప్రచురింపబడిన, 'ఛాందసుడు', 'అస్సాల్ట్ అండ్ రేప్' అన్న కథలలో (జూన సంచిక), వాటిమీద, వాటి బాగోగుల మీదా జరిగిన వాదోపవాదాలు (జులై, అగస్టు సంచికలు) చదివాను - వీటి గురించి మొదటి కథ రచయిత ఏమీ చెప్పలేదు గాని, రెండో కథ రచయిత తన కథను సమర్థించు కుంటూనే, దిగులుపడి క్షమాపణ చెప్పుకోవడ మెందుకో అర్థం కాలేదు.

కొందరు నైష్ఠికులు వీటిని సెక్సు కథలను కున్నారేమో - ఆ రచయితల మీద విరుచుకు పడ్డారు. 'ఛాందసుడు' లోని ఛాందసపు అబ్బాయిది ఒక వింత స్వభావం. కాని యీ తరహా వాళ్ళు మనలో దండిగానే వున్నారు. అతగాడికి వ్యభిచారం చెయ్యడానికి అభ్యంతరం లేదు. కాని గోత్రం అడ్డొచ్చింది కాబట్టి నిగ్రహించు కుంటాడు, పాపం! సర్వ పాపాలూ, సర్వద్రోహాలూ చేస్తూనే నున్నగా బోడిగుళ్ళు చేయించుకుని, దేవుడి హుండీలు నింపే భక్తాగ్రేసరుల వంటివాడు, ఆత్మవంచన చేసుకున్న యీ అబ్బాయి. అయితే ప్రేమికురాలిని కథకుడు ద్రౌపదితో కాక, ఏ తారతోనో పోల్చితే సరిపోయేది - ద్రౌపది పంచభర్తృకే గాని కులట కాదు కదా.

రెండో కథ యింతగాను కోపతాపాలను రేకెత్తించింది. భార్యల్ని గొడ్డుకన్నా హీనంగా కాల్చుకు తింటూన్న పరిస్థితులు ఎరగని అజ్ఞానులై వుండరు, యీ విమర్శకులు. కాని యిటువంటి దారుణాల్ని దాచిపెట్టి వుస్తే, వీళ్ల ఆత్మలు సంతోషిస్తాయేమో. సంఘంలో వున్న యిటువంటి తీవ్ర రోగాలకు, యిటువంటి కథలు చికిత్స వంటివి. మొండి వాదాలకు దిగే వారి మనస్సులను, యివి మెరుగు పర్చలేకపోతే, ఆ లోపం కథకులది కాదు.

కె. వి. స్వామి హైదరాబాద్

(ఈ చర్చ యింతటితో ముగిస్తున్నాము - సం)

స్వీయ కథానికా పఠనం
సెప్టెంబరు 3 (ఆదివారం)
సాయంత్రం 6 గంటలకు
పొట్టిశ్రీరాములు స్మారక మందిరంలో
అందరికీ స్వాగతం

ABHYUDAYA September 1978 Regd. No. TN. MS. (c) 289



నూట ఏభయ్యవ జన్మదిన సందర్భంగా
లియో టాల్‌స్టాయ్‌కి గౌరవాంజలి

Edited and Published By T. Venkataramiah, at 15, Arulammal Street, Madras - 600 017 and Printed at Sri Venkateswara Printers, Madras-600 021